# ప్రతిమా నాటకము

భాసకృతికి తెనుఁగు



వేటూరి ప్రభాకరశాస్త్రి

# ప్రతిమా నాటకము

భాసకృతికి తెనుఁగు




కర్త

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

చతుర్థ ముద్రణము

వెల ౨-౦-౦ ] [ ౧౯౫౩

# తొలిపలుకు

( ప్రథమ, ద్వితీయ, తృతీయ ముద్రణములందు )

ఇప్పటికించుమించుగాఁ బదునేడేండ్లకుఁ బూర్వము నే నీ నాటకమును దెలిఁగించితిని. మన్మిత్రులు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రప్పుడు తిరువనంతపురమునందుఁ గార్యాంతమునఁ గొన్ని మాసములు వసించి భాసనాటకములఁ గొన్నింటి నక్కడనుండి వ్రాసికొనివచ్చిరి. అప్పటి కింకను తిరువనంతపుర గ్రంథమాలలో నా నాటకములు ముద్రితములు గాలేదు. ఆ వ్రాఁతప్రతులను బట్టియే కవిగారు కొన్ని నాటకములను దెలిఁగించిరి. నేను గొన్నింటిని దెలిఁగించితిని. పెద్దదగు నీ ప్రతిమానాటకమును నే నప్పుడు ముద్రింపఁ జాలనైతిని. తరువాతఁ దిరువనంతపుర రాజకీయ సంస్కృత గ్రంథమాలా సంపాదకు లగు శ్రీగణపతిశాస్త్రిగారీ ప్రతిమానాటకమును రెండుమార్లు ప్రకటించిరి. రెండవతూరి స్వరచిత వ్యాఖ్యాసహితముగాఁ బ్రకటించిరి. నే నిప్పుడు దీనిని బ్రకటించుటలో నా వ్యాఖ్యానముయొక్క తోడ్పాటునుగూడఁ బడసితిని. రెండుమూఁడుచోట్లమాత్ర మా వ్యాఖ్యానరీతిని, పాఠరీతిని విడిచి తొలుత నాకుఁదోఁచిన యర్థమును, నేను జూచిన వ్రాఁతప్రతిపాఠమును బాటించితిని. అవియే యనుగుణముగా నున్నవన్న నమ్మిక నాకుఁ గలదు. పెక్కుపట్టుల గణపతిశాస్త్రిగారి వ్యాఖ్య మిక్కిలి చక్కఁగా నున్నది. భాసనాటకము లని

గణపతిశాస్త్రిగారు ప్రకటించిననాటకచక్రము భాసకృతము గా దని యిప్పుడు గొందఱు ఉద్ఘోషించుచున్నారు. కాని యీ యుద్ఘోషములు గణపతిశాస్త్రిగారు చెప్పిన కారణముల నెల్ల ఖండింపఁజాలినవి గా లేవు. రామాయణ భారత కథలనుబట్టి భాసుఁడు రచించిన నాటకము లాతఁడు రామాయణ భారత కథలలోని యనౌచిత్యములను సంస్కరించుటకై యభిమానించి రచించినాఁడేమో యనఁదగిన ట్టున్నవి. ప్రస్తుతమయిన యీ ప్రతిమానాటకమునం దట్టి సంస్కారములను బరికింపఁ దగును. కైకేయీవృత్తమును, సీతావృత్తమును నిందుఁ జక్కఁగా సరి పఱుపఁబడినవి. కైకేయికి దుర్బుద్ధి యీ నాటకరీతిని గాన రాదు. సీత హిరణ్యమృగమును గోరుటగాని, లక్ష్మణుని నవాచ్యవచనము లాడుటగాని యిందుఁ గానరాదు. పంచమ షష్ఠాంకములను జూచినచో నీ విషయము తేటపడును.

ప్రథమాంకమున వల్కలకల్పనము, తృతీయాంకమున దశరథప్రతిమాకల్పనము, పంచమాంకమున దశరథ శ్రాద్ధకల్పనము నిందు సర్వోత్తవిషయములు. ఇవి మిక్కిలి సరసములై, సంగతములై యున్నవి. ప్రతిమానాటకరచనలు గొన్ని శాకుంతల నాటకరచనలో ననుకరింపఁబడినవి. తృతీయాంకమున రథవేగవర్ణనము, పంచమాంకమున "కసుగందుఁజే" ఇత్యాది సీతావనస్థితివర్ణనము, కాళిదాసుని శాకుంతల రథవేగ వర్ణనమును, 'సరసిజ మనువిద్ధ' మిత్యాది శకుంతలావనస్థితి వర్ణనమును జూడఁదగును. సీత చెట్లకు నీళ్ళు పోయుచుండుటను

వర్ణించు "సీ. ఆలవాలముల నిండార నుర్వీలంవాటి" అను పద్యము (పంచమాంకము) స్వభావోక్తిసౌభాగ్యముచే నెంతయు హృద్యముగా నున్నది.

స్వప్రయోజనముగా జరిపిన సంస్కారములుగాక వాల్మీకి రామాయణ కథకును, ఈనాటకకథకును భేదములు కొన్ని గాన వచ్చుచున్నవి. అట్టి దొక్కటి: ఇందు లక్ష్మణుఁడు పెద్ద వాఁడుగాను, భరతుఁడు చిన్నవాఁడుగాను గానవగును. లక్ష్మ ణుఁడు భరతుని 'వత్స!' యని పిలుచును; ఆశీర్వదించును. భరతుఁడు లక్ష్మణునకు మ్రొక్కును; 'ఆర్య!' యని పిలు చును. ఈ విషయము వాల్మీకిరామాయణమున సంశయగ్రస్త ముగా నున్నది. బాలకాండములో—"పుష్యేజాతస్తుభరతః— సార్పే జాతౌతు సౌమిత్రీ—" అని కలదు. భరతుఁడు పుష్య నక్షత్రమునను, లక్ష్మణశత్రుఘ్ను లాశ్లేషానక్షత్రమునను జన్మిం చిరి. కాన భరతుఁడే జ్యేష్ఠుఁ డగును. కాని, దీనికి విరుద్ధ ముగా లక్ష్మణుఁడే జ్యేష్ఠుఁ డగు ననుటకుఁగూడ సాధనములు కొన్ని రామాయణమునందుఁ గలవు. యుద్ధకాండమున ౧౩౦-వ సర్గము ౩౯-వ శ్లోకము.

"తతో లక్ష్మణ మాసాద్య వైదేహీం చాభ్యవాదయత్
అభివాద్య తతః ప్రీతో భరతో నామ చాఽబ్రవీత్"

అని కలదు. సరళరీతిని జూడఁగా నిక్కడ భరతుఁడు లక్ష్మ ణుని, సీతను నమస్కరించిన ట్లర్థ మేర్పడును. ఇట్లు చెప్పి

నని 'వైదేహీంచ' యనుట సమర్థ మగును. జన్మకాలమునుబట్టి భరతజ్యైష్ఠ్యము ప్రవ్యక్త మగుచుండుటచే రామాయణవ్యాఖ్యాత లిక్కడ చిక్కుపడిరి. గోవిందరాజు "లక్ష్మణమాసాద్య = కృతనమస్కారం లక్ష్మణ మాలింగనేన సంభావ్య, ఇదంచ లక్ష్మణస్య కనిష్ఠత్వాత్, లక్ష్మణేన చికీర్షితో నమస్కారో రామసన్నిధౌ భరతేన ప్రతిషేధిత ఇతి చాహుః. వైదేహీం చాభ్యవాదయత్ - చకారో రామనమస్కారం సముచ్చినోతి" అని వ్రాసెను. మఱియు నీతఁడు "సీతామాదాయ గచ్ఛత్వ మగ్రతో భరతాగ్రజ" అని స్థలాంతరమునఁ గల వాల్మీకిరామాయణ ప్రయోగము సరళరీతిని లక్ష్మణజ్యైష్ఠ్యమును జెప్పుచున్నను, జన్మకాలరీతికి విరుద్ధ మగుటచే, "భరతాగ్రజ ఇత్యత్ర బహువ్రీహి రిత్యుక్తమ్" అని క్లిష్టార్థము గల్పించెను. "స సంఖ్యే భరతానుజః" అని యింకొకచో భరతజ్యైష్ఠ్యవ్యంజక ప్రయోగమును గలదని గోవిందరాజు పేర్కొనెను. తిలకవ్యాఖ్యానమున 'తతో లక్ష్మణ మాసాద్య' యను శ్లోకమున లక్ష్మణునకు భరతుఁడు నమస్కరించినట్లే యర్థము చెప్పఁబడినది. కాని, దాని, నాతఁడు వేఱువిధమున సమర్థింపఁబోయెను:—'యద్యపి లక్ష్మణో భరతా త్కనిష్ఠో వయసా - స్పష్టం చేదం జన్మప్రకరణే తథాఽపి జ్యేష్ఠానువర్తనేన స్వాపేక్షయా అధికగుణత్వేన స్వవ్యవహారేణ జ్యేష్ఠానువృత్తి రేవం కర్తవ్యేతి భరతం ప్రతి ఉపదేశదానేనచ గురుత్వబుద్ధ్యా తస్య నతి రుచితైవ'. ఇది వైష్ణవసంప్రదాయరీతి నున్నది - పాయస

ప్రదానమునుబట్టి వివాహక్రమమునుబట్టి లక్ష్మణునికే జ్యేష్ఠ్యము గానవగును. గోవిందరాజు దీనిని జేర్చి యది జన్మకాలరీతిచేఁ బరిహృత మయ్యెననెను. భవభూతి భరతజ్యైష్ఠ్యమునే పాటించెను. అర్వాచీనులు పలువురు భరతజ్యైష్ఠ్యమునే యభిమానించినను, ప్రాచీనుఁడగు భాసునినాఁట లక్ష్మణజ్యైష్ఠ్యమే లక్షిత మైన ట్టి నాటకమునుబట్టి తెలియనగును. లక్ష్మణజ్యైష్ఠ్యము వాల్మీకిసమ్మతము గా దనికూడ స్పష్టముగాఁ జెప్పఁజాలము.

భరతునివృత్త మిందుఁ బరమోత్తమముగాఁ గాపాడఁబడినది. వాల్మీకులవారుగూడ భరతునివృత్తము గడుపవిత్రముగఁ జిత్రించిరి. ఈ నాటకమున భరతోక్తి యిది యెంతయు హృద్యము !—

"శా. పాపాత్ముం డగు నేని.............దీఱుతఱా"

(తృతీయాంకము)

'కొడుకు దుష్టుఁడేని ఘాటశ్రాద్ధము చేసి వాని కపుత్రత్వమును గల్పింపవచ్చును. వానికి దాయ మీయ నక్కఱలేదు. వానితో నాశౌచాది సంబంధ ముండదు. కాని, తల్లి యెంత దుష్టురాలైనను, ఆమెమాతృత్వము తొలఁగదు' అని ధర్మశాస్త్రనిర్ణయము గలదు. ఇతరదోషము లున్నను మాతృత్వము తొలఁగకపోవచ్చును. గాని, యామె భర్తృద్రోహము చేయునేని యప్పుడు మాతృత్వము తప్పక తీఁపోవలసినదే

యని యీ ధర్మశాస్త్రమును భరతుఁడు సంస్కరింతు ననుట హాస్యాతిహాస్యము! ఇట్టివిషయము లనేకము లిందుఁ గలవు. సరసులు గుర్తింపఁగలరు.

బహుకాలమునకు ముందే రచించినను మూలఁబడవైచిన యీనాటకమును మన్మిత్రులు, విద్వాంసులు, వినీతులు నగు శ్రీజయంతిపురము జమీన్దారుగారు వాసిరెడ్డి శ్రీదుర్గాసదాశివేశ్వరప్రసాద బహద్దరుగారు, ముద్రింపఁ బ్రోత్సాహపఱిచిరి. వారిచేఁ బ్రోత్సాహితుఁడను గానిచో నే నిప్పుడు దీనిని ముద్రింపఁబూనను. ప్రకటనమునకు బహురచనములు పయిపయి వచ్చుచున్నను, అప్రౌఢకృతి యయినను నాయీనాటకము నందుకొని ప్రకటించిన భారతీపత్రికాధిపతుల సాహాయ్యము ప్రశంసించుచున్నాఁడను. మధురకవితారచనాప్రథితు లగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారు గూడ నీనాటకమును దెలిఁగించినట్లును, బ్రకటించినట్లును వింటిని. కాని దాని నే నింతవఱకును జూడలేదు. గుణదోష వివేచనమునకు సహృదయులు ప్రమాణము.

మదరాసు
౨౮-౧౧-'౨౭

వేటూరి-ప్రభాకరశాస్త్రి

# ప్రతిమా నాటకము

---

[ నాంది యయినతర్వాత సూత్రధారుఁడు ప్రవేశించును. ]

సూత్రధారుఁడు—

గీ. సీతచెలికాఁడు లక్ష్మణాశ్రితుఁడు భరత
హితుఁడు సుగ్రీవరాముఁ డప్రతిమమతి సు
మంత్రనుతుఁడు విభీషణాత్మకుఁడు రావ
ణారి యగు శౌరి మీకు శ్రేయము లొసంగు.

(తెరవంకఁ జూచి)

ఆర్యా! ఇటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఇదిగోనండీ వచ్చినాను.

సూత్ర—ఏదీ! ఈ శరత్కాలమునుగూర్చి ఒక్కపాట పాడుము.

నటి—అలాగేనండీ! పాడుతున్నాను.

(పాడును

సూత్ర—ఈ కాలమున-

గీ. సైకతములందుఁ గాశవస్త్రములఁ దాల్చి
యంచచెలి మైమయిని నడయాడుచుండు—

(తెరలో)

అయ్యా! అయ్యా!

సూత్ర—(విని) సరి; తెలిసినది.

ప్రమదము దలిర్ప రాజసౌధమునయందు
నాత్రమున వర్తిలెడు ప్రతీహారివోలె.

(నిష్క్రమించిరి.)

ఇది స్థాపన

---

ప్రతీహారి—(ప్రవేశించి) అయ్యా! కాంచుకీయులలో ఎవరూ ఇక్కడున్నవారు?

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) అమ్మా! ఇదిగో నేనున్నాను. ఏమి చేయవలెను?

ప్రతీ—అయ్యా! దేవరాక్షస యుద్ధములలో అప్రతిహతమహారథు లయి గెలుపొందినవారు దశరథమహారాజులుంగారు ఈ విధంగా ఆజ్ఞాపిస్తు

న్నారు: "చిరంజీవి శ్రీరామచంద్రునికి రాజ్య ప్రాభవము సంక్రమింపఁజేయుటకు అభిషేకసంభార ములు శీఘ్రముగా ఆయత్తపఱచవలసినది" అని.

కాంచుకీ—అమ్మా! మహారాజులుంగారు సెలవు దయచేయించినట్లు సర్వము సంసిద్ధపఱుచు టయినది. అవిగో చూడు—

సీ. పటహాదివాద్యముల్ పరికలితము లయ్యె
వందివర్గము చేరవచ్చి యుండె
వార్తికచ్ఛత్రచామరము లాత్తము లయ్యె
భద్రాసనము సిద్ధపఱుపఁబడియె
సౌవర్ణకలశముల్ సమకూర్పఁబడెఁ దీర్థ
వారితోఁ గుశపుష్పపూరితముగ
రప్పింపఁబడెఁ బుష్యరథము మంత్రులతోడఁ
బౌరు లారంగూరి పాటుతెంచి

రింత కెల్ల మంగళ మయి సంతరించు
నంచితుఁడు వేదమూర్తి మహామహుండు
విధివిధానము లెల్ల నిర్విఘ్న పఱచి
వెలయుచున్నాఁడు వేదిపై నలువకొడుకు.

ప్రతీ__ఆలాగా! సరి! చక్కఁగా సవ కూర్చినారు.

కాంచుకీ__ఆహా! మేలుగదా!

ఆ. జగతియందు రామచంద్రుఁ డఁట చంద్రుని
కఖిల రాజ్యపట్ట మప్పగించి
యిపుడు భూమిప్రజలఁ గృతకృత్యులను జేసె
దశరథేశ్వరుండు తానుఁ దనిసె.

ప్రతీ__అయ్యా! త్వరపడు! త్వరపడు!

కాంచుకీ__అమ్మా! ఇదిగో నేను తొందర తోనే ఉన్నాను. (అని నిష్క్రమించును)

ప్రతీ__(పరిక్రమించి చూచి) అయ్యా! సంభవకా! సంభవక! వెళ్ళు, నీవుకూడా మహారాజులుంగారి సెలవైందని పూజ్యులయిన పురోహితుల వారిని తొందరపెట్టు. మర్యాదతో మాటాడు సుమా వారితో! (ప్రక్క కరిగి) సారసికా! సారసికా! సంగీతశాలకు పోయి నాటకులకు విన్నవించు—'సమయానుగుణమైన నాటక మాడడానికి సన్నద్ధులు గావలసిన' దని. ఇదిగో నేనూ వెళ్ళి

సర్వము సమకూర్చుడ మైపదని మహారాజులుం గారితో మనవి చేసుకుంటాను. (నిష్క్రమించెను)

(అంత అవదాతిక నారచీర గొనివచ్చును.)

అవదాతిక—అయ్యో ! ఎంత తంటాగా ఉంది ! నవ్వులాటలకు నారచీర ఎత్తుకువస్తేనే నాకు ఇట్లా ఉందే ! దురాశతో పరధనము దొంగిలిం చుకు వస్తారే, వాళ్ళకు ఇంకా ఎట్లా వుంటుందో ! నవ్వు తెచ్చుకుందా మనుకుంటాను. ఒక్కర్తెను ఎట్లా నవ్వేది ?

(అంత సీత సపరివారమై ప్రవేశించును.)

సీత—(చెలితో) ఓసీ! అవదాతిక ముఖమేమో వెలవెల పోతున్నట్లున్నది, ఎందుచేతనోకదా!

చేటి—అమ్మా ! పరిచారిక లంటే అతప్పూ ఈతప్పూ చేస్తూఉంటారు గదా ! ఇప్పు డేదో తప్పు చేసిఉంటుంది.

సీత—కాదుకాదు. నవ్వు తెచ్చుకోవలె నని చూస్తున్నట్లున్నది.

అవదాతిక—(చేరఁబోయి) రండి, అమ్మగారూ! రండి. నేను తప్పు చేయలేదు సుమండీ; నే నేమీ తప్పు చేయలేదు.

సీత—ఎవరు ని న్నడిగినారు, అవదాతికా! ఏమిటే అది? ఎడమచేతిలో ఏమిటో ఉంచుకున్నావు?

అవదాతిక—అమ్మగారు! ఇది నారచీరండి!

సీత—నారచీర నెక్కడనుంచి తెచ్చినావే?

అవ—అమ్మగారు! వినండి చెప్పుతున్నాను. ఆమెనండి - నాటక రంగాలంకారాలు జాగ్రతపరుస్తుందే ఆమెను, రేవమ్మగారిని - 'పనితీరిపోయినవి అశోకపుచిగురుటాకులు ఉంటేను నా కి' మ్మని అడిగినానండీ. అడిగితేను, 'వల్లకా' దన్నది. అందుకని ఆమెగారిపని పట్టించడంకోసం అక్కడనుంచి ఇది తీసుకువచ్చాను.

సీత—తప్పుపని చేసినావు; పో ఇచ్చిరా.

అవ—అమ్మగారూ! నవ్వులాటలకు గాదండీ దీనిని నేను తీసుకువచ్చింది?

సీత——వెఱ్ఱిదానా ! ఇట్లాగే తప్పులు పెరుగుతవి; వెళ్ళు, ఇచ్చివేయి; ఇచ్చివేయి.

అవ——చిత్తం, అమ్మగారూ ! ఇచ్చివేస్తాను.

(నారచీరను బయలుగాఁ బట్టుకొని వెళ్ళుచుండును.)

సీత——ఓసీ ! ఇట్లా రా !

అవదాతిక——అమ్మగారు! ఇదిగో వచ్చాను.

సీత——ఓసీ ! ఏమే, ఇది నేను కట్టుకుంటే బాగుంటుందా ?

అవ——అమ్మగారు ! చక్కనివారి కన్నీ చక్కగానే ఉంటవిగాదండీ ? మీరు కట్టుకు చూడండి !

సీత——ఐతే ఇటుతే. (తాల్చి) ఓసీ ! చూడు! ఇప్పుడు బాగుందా ?

అవదాతిక——మీరు బాగుందండీ ! నారచీరయినా పమిడిచీరలా గుంది.

సీత——(చేటితో) ఓ ! ఏమే, నీ వేమీ మాటాడవు ?

చేటి—మాటలెందుకోటి యెందుకు? ఇవిగో ఒళ్ళంతా గగుర్పులు చెప్పుతున్నవి; చూడండి.

(గగుర్పులు చూపును)

సీత—ఓసీ! అద్దమిట్లా తీసుకురా!

చేటి—చిత్తము (తెచ్చును) అమ్మా! ఇదిగో అద్దము.

సీత—(చేటీముఖముచూచి) ఉండనీ అద్దము; నీ వేమో చెప్పఁదలఁచుకొన్న ట్లున్నావు.

చేటి—అమ్మగారూ! నే నిట్లా విన్నాను; కంచుకి బాలాకయ్యగారు "అభిషేకము, అభిషేకము" అని అంటున్నారు.

సీత—ఎవరో రాజ్యాభిషిక్తు లవుతారు!
(ఇంకొక చేటి వచ్చి)

చేటి—అమ్మగారు! శుభవర్తమానం, శుభవర్తమానం.

సీత—ఏమి టేమిటే; బులపాటంతో అంటున్నావు!

చేటి—బాబుగారికి అభిషేకము గాదండీ!

# ప్రథమాంకము

సీత—తండ్రిగారు క్షేమముగా ఉన్నారా?

చేటి—మహారాజులుంగారే పట్టం గట్టు తున్నారు.

సీత—అయితే కెంకుశుభవార్తలు విన్నాను. బాగా పెద్దగా ఒడిపట్టు.

చేటి—ఆహా! (అట్లు చేయును.)

(సీత నగల పెట్టెఁదీసి యిచ్చును)

చేటి—అమ్మగారూ! నగారా మోతలాగున్నది.

సీత—అదే.

చేటి—ఒక్కసారి గట్టిగా కణకణ వాయించి మరి ఊరుకున్నారేమి చెపుమా?

సీత—ఏదయినా అడ్డంకి వచ్చిందేమో అభిషేకానికి? ఏమంటే, రాజస్థానములు బహు గడబిడలతో ఉంటవాయెను.

చేటి—అమ్మగారు! నే నట్లా విన్నాను. బాబుగారికి పట్టముగట్టి మహారాజులుంగారు అడవికి వెళ్ళుతారట.

సీత—అయితే ఆ ఉదకము రాజ్యాభిషేకము కోసముకాదు. కన్నీటిముఖము కడుగుకొనడముకే.

(అంత రాముఁడు ప్రవేశించును.)

రాముఁడు—అన్నా!

సీ. పటహప్రణాదముల్ ప్రారంభ మయ్యెను
కూర్చుండి రేతెంచి గురుజనులును
భాసురంబైన భద్రాసనంబున యందు
నధివసించితి నేను విధిహితముగ
తల యొగ్గితి సువర్ణకలశంబుల జలంబుఁ
గ్రుమ్మరింపఁగ నెత్తికొనిరి మఱియు
నన్ను నాహ్వానించి నరనాథుఁ డంతలో
నట వీడి చను మని యాన తిచ్చె
విడిచి యట్టె నేను వెడలితిఁ బ్రజ లట్టి
ధైర్యమునకు నద్భుతంబు గనిరి
వింత యేమి యుండు సంతాన మిలయందుఁ
గన్న తండ్రిమాట విన్నచోట!

'నాయనా! నీ విప్పుడు విశ్రమింపు' మని రాజుగారు నన్ను వీడుపుచ్చఁగాఁ దలబరువు దీఱినట్లు, తెప్పఱిల్లినట్లు నా మదికిఁ దోఁచినది. నేను వెను




కటి రామచంద్రుఁడనుగానే, మహారాజు... మహారాజుగారుగానే ఉండుట మంచిది. ఇదిగో ఇప్పుడు మైథిలిని జూచెదను.

అవదాతిక—అమ్మగారూ! రాజకుమారులుం గారు వస్తున్నారు. నారచీరను విడవలేదు వారు !

రాముఁడు—మైథిలీ! ఏమి చేయుచుంటివి ?

సీత—ఏమి! ఆర్యపుత్త్రులా! (చూచి) జయము ఆర్యపుత్త్రులకు.

రాముఁడు—మైథిలీ! కూరుచుండుము.

(కూరుచుండును)

సీత—చిత్తము. సెలవుప్రకారము.

(కూరుచుండును)

అవదాతిక—అమ్మగారూ! రాజకుమారులుం గారు మునుపటి వేషముతోనే ఉన్నారు. మన మనుకొన్నది అబద్ధమువలె ఉంది.

సీత—అటువంటివారు అబద్ధమాడరు. ఐనా రాజస్థానములు ఎన్నో గడబిడలతో ఉంటవి.

రాము___మైథిలీ! ఏమి టది? ఏమో మా టాడుచున్నావు?

సీత___ఏమీ లేదు. ఈ పిల్ల అంటున్నది 'అభిషేకము అభిషేకము' అని.

రాము___నీ కుతూహలము తెలిసికొన్నాను. అగును; అభిషేకప్రయత్నము జరగకపోలేదు. వినుము! ఇప్పుడు మహారాజుగారు ఉపాధ్యాయామాత్య ప్రకృతిజనసమక్షమున నన్ను బాల్యాభ్యస్త మయినయంకమునఁ గూర్చుండఁబెట్టుకొని కోసలరాజ్యము నొకయేల్బడి క్రిందికిఁ దెచ్చి "నాయనా! రామచంద్రా! నీతల్లికడుపు చల్లఁగా నీవు రాజ్యమును గ్రహింపుమా" యనిరి.

సీత___అప్పుడు మీ రేమి పలికితిరి?

రాముఁడు___మైథిలీ! నే నేమిపలికియుందు నని నీ వనుకొనెదవు.

సీత___ఆర్యపుత్త్రు లప్పుడు బదులు పలుకక నిట్టూర్పు విడిచి మహారాజులుంగారి పాదములపైని పడిఉంటా రని నే ననుకొంటాను.

రాము—సరిగా నూహించితివి. తుల్యశీలురగుదంపతులను బ్రహ్మ సకృత్తుగా సమకూర్చుచుండును. అట్లే అప్పుడు పాదములపైఁ బడితిని.

గీ. మీఁదఁ బడు తండ్రిగారి బాష్పోదకమునఁ
గ్రిందఁబడు నాదు బాష్పవార్బిందువులను
సమముగాఁ దండ్రిగారి పాదములతోడఁ
దడిసె నప్పుడు నాదు మస్తకముగూడ.

సీత—అటుతర్వాత ?

రాముఁడు—అటుతర్వాత వారి యనునయవాక్యములకు నే నంగీకరింపకపోఁగా, వారు జరాదోషము సమీపించిన తమప్రాణములమీఁదను ఒట్టు పెట్టినారు.

సీత—ఆపైని ?

రాముఁడు—ఆపై నప్పుడు—

గీ. తొడరి యభిషేకఘటము శత్రుఘ్న లక్ష్మ
ణులు గొనిరి; గొడుగు జేఁడు రోదిలుచుఁ గొ
ద్దొ ట్రిలుచు జేనిచెవిలో నెదో వచించె [నియె;
నంత మంథర; రాజు గానైతి నేను.

సీత—నాకు చాలా సంతోషము. మహారాజులుగారు మహారాజులుగారే; ఆర్యపుత్త్రులు ఆర్యపుత్త్రులే.

రాము—మైథిలీ! అలంకారములను దీసియుంటి వేల?

సీత—నేను పెట్టుకొననేలేదుగదా?

రాము—కాదు. ఇప్పుడే నీవు నగల నూడఁదీసియుందువు.

చ. ఒరసెను గమ్మదోయి వడి
నూడ్చుకతంబునఁ గర్ణరంధ్రముల్,
గరములఁ దెల్పు గన్పడెడుఁ
గంకణముల్ వదలించుటన్, మెయిన్
బరు వయియున్న పెన్నగల
పట్టునఁ దొట్టినయొత్తు లిత్తఱిన్
విరియకయున్న, వో యువిద!
వీడితి విప్పుడె భూషణావళుల్.

సీత—ఆర్యపుత్త్రులు అబద్ధముకూడా సత్యమువలె సందర్భింపఁజేసి చెప్పఁగలరు.

రాముఁడు—అవును లెమ్ము. ఇంక నలంకరించుకొమ్ము. నే నద్దము పట్టుకొందును. (అట్లుచేసి సర్వర్ణించి) నిలుము.

గీ. అద్దమున నారచీరలయట్లు దోఁచె
సూర్యకిరణంబులా యివి సుదతి! కావు.
నవ్వుచేత నూహించితి, నివ్విధమున
వేడుకకుఁ దాల్చితివొ వ్రతవిధికొ చెపుము!

అవదాతికా! ఏమియిది?

అవదాతికా—దేవా! ఏమో బాగుంటుందో, బాగుండదో చూదామని ముచ్చటకు కట్టుకొన్నా రమ్మగారు.

రాముఁడు—మైథిలీ! ఏమది? ఇక్ష్వాకువంశమువారి ముసలితనపు టలంకారమును ధరించితివి? ప్రియమే నాకును; ఇటు లెమ్ము.

సీత—వద్దు వద్దు. ఆర్యపుత్త్రిలు అమంగళము లాడనద్దు.

రాముఁడు—మైథిలీ! ఏల వల దనెదవు?

సీత—అభిషేకము తప్పిపోయిన మీ కిది అమంగళపుమాట అని నాకు తోఁచుచున్నది.

రాముఁడు—

గీ. ముచ్చటకు నన్ను దాసక్తై ముద్దరాల,
పెద్దగా సంకటమ్ము గల్పించుకొనకు;
సరి, మరేమి? నా మేనిలో సగమ్ము నీవు
తాల్చితివి; నేను దాల్చు చంద మది గాదె.

(తెరలో) అయ్యో! అయ్యో! మహారాజులుంగారు!

సీత—ఆర్యపుత్రా! ఏమి టది?

రాముఁడు—(విని)

గీ. పూరుషులు స్త్రీలు నటు మితిమీఱి గోల్లు
వెట్టుచున్నారెదో పెద్దచెట్టు కలిగె
ఎందు కేనియు నేఁ జాలియుందు నంచు
వెల్లడించెను దైవంబు; తెల్ల మయ్యె.

తొందరగా నా గగ్గోలెందుకో కనుఁగొందురుగాక!

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) బాబుగారూ, కాపాడుఁడు, కాపాడుఁడు!

రాము—ఆర్యా! ఎవరిని కాపాడవలెను?

కాంచుకీ—మహారాజులుంగారిని.

రాముడు—మహారాజులుంగారినా? ఆర్యా! "ఒక్క శరీరమం దొదిగియున్న యుర్వి నెల్ల" ననికదా యనవలసినది! కాని, ఎవరివలన నేర్పడినది కీడు?

కాంచుకీ—స్వజనమువలన.

రాముఁడు—స్వజనమువలనా? అయ్యో! ప్రతీకారము లేదే!

గీ॥ బాధ మేనికే కూర్చు విరోధి యైన
దది స్వజన మైన హృదయంబు నదరఁజేయు
నీ "స్వజనశబ్ద" మెవ్వరి నేర్పరించి
న న్నిపుడు లజ్జితునిఁ జేయ నున్న దయ్య?

కాంచు—ఎవ్వరి నేర్పరించునా? కైకేయి దేవిగారిని.

రాముఁడు—ఏమి! అమ్మగారినా? అట్లయినచో నదియేదో ఫలోత్తరమయిన మేలేకావలెను.

కాంచు—అది యెట్లు?

రాముఁడు—వినుఁడు :

ఆ. భర్త యింద్రునంతవాఁడటె మఱియు నా
యట్టివాఁడు పుత్త్రుఁడట్టె యామె;
కేమికామితంబు సిద్ధించి తుచ్ఛ మా
చెయ్ది యామె చేయ నెయ్దుకొనును?

కాంచుకీ—బాబూ! చాలును. పాడయి పోయిన యాఁడుబుద్ధులందు మీ మంచితనము నుంచఁబోకుఁడు. ఆమె మాటమీఁదనే కాదా బాబూ, మీ యభిషేక మాఁగిపోయినది ?

రాము—ఆర్యా! అందు మేళ్ళకలవు కదా!

కాంచుకీ—అది యెట్లు?

రాముఁడు—వినుఁడు :

చ. వనగమనమ్ము భూమిపతి
వర్యున కుండదు, తండ్రిచాటువాఁ
డ నగుదు నేను దాన నెగ
డంగల దింకను నాకు బాల్యమే,
జనులకుఁ గ్రొత్త యేల్బడి వి
చారము తీఱును, నింతకంటె నా

యనుజులు పొందనుందురు మ
హోర్వీ ధరాధిప భోగవంచనన్.

కాంచుకీ__ఇంకను బయిటఁగా పిలువని పేరం
టముగావచ్చి "భరతునకు రాజ్యాభిషేకము చేయ
వలసినది" అన్నది. ఇదికూడ మచ్చరము లేని
మంచితలఁపే యందురా బాబూ!

రాము__ఆర్యా! నీవు మామీఁది పక్ష
పాతముచే నిజమును గుర్తింపకున్నావు. ఎట్లనఁగా,

ఆ. శుల్కమందు ముందు పల్కంబడిన రాజ్య
మడిగె నేమొ యామె కొడుకుకొఱకు
మచ్చరంబు నెంతు విచ్చోటఁ; దమ్ముల
సిరి హరించు నన్ను నరయవుగద!!

కాంచుకీ__బాబూ! అంతేకాదు. మఱియును,

రాము__ఇఁకమీఁద నమ్మగారిపై నవ
దూఱు విననొల్లను. మహారాజుగారి వృత్తాంతము
మాత్ర మేమో తెలుపుము.

కాంచుకీ__దానిమీఁద నప్పుడు__

ఆ. శోకమునను వాసు రాక, చేసన్నచే
నన్నుఁ బుచ్చె నిటకు; నంతలోనె
యీప్సితమ్ము తనకు నెదియేని కలదేమొ
మూర్ఛలోన జేఁడు మునిఁగినాఁడు.

రాము—ఏమీ! మూర్ఛలో మునిఁగెనా?

(తెరలో)

"ఏమీ! మూర్ఛలో మునిఁగెనా" యనెదవా?

ఉ. తాల్పుము విల్లు జేసి పరి
తాపము సైఁపనిచో; దయామతిఁ
గొల్పకు

రాముఁడు—(విని యెదుటఁ జూచి)

ఆ. లక్ష్మణుండు ధైర్యలక్షితుం డక్షోభ్యుఁ
డయ్యు నేలొ క్షుభితుఁ డయ్యె నిపుడు?
కోపగించి యతఁడు చూపట్ల నా కెట్ల
యెదుటఁ దోఁచె నూర్ధ్వ రేఖ యనఁగ.

(అంత విల్లు నమ్ములు పూని లక్ష్మణుండు ప్రవేశించును)

ఉ. తాల్పుము విల్లుజేని పరి
తాపము సైఁపనిచో; దయామతిఁ

సర్వాణినిని

గొల్పకు; మిక్కిలి మెత్తనం గ
నుంగొని యెత్తుదు రెండు బందుగుల్;
తెల్పు మనుజ్ఞ; లేకనుమ
తించి నను౯ విడు మాంద్యుంబుర్వ్యాలన్
దుల్పెద లోకమం, దిఁక ని
టుల్ పడలేముగదన్న, వంచనల్ !

సీత—ఆర్యపుత్రా ! దుఃఖించవలసినసమయ
ములో సౌమిత్రి విల్లెత్తుకొన్నా డేమి? ఎన్నడూ
ఎరగని ఆయాస మిది యేమిటి ?

రాముఁడు—సౌమిత్రీ ! ఇది యేమి ?

లక్ష్మ—ఏమీ ! 'ఇది యేమి' యనెదవా ?

చ. క్రమముగ సంక్రమింపఁదగు
రాజ్యము నీ కది లేకపోయె, దుః
ఖమున మునింగి భూవిభుఁడు
గద్దియ వీడ్కొని నేలఁ గూలె, నీ
సమయమునందుఁగూడ నిటు
సందియ మందెద వన్న ! దీని నే
క్షమగఁ దలంతునా, మనసు
చాలకపోవుటగాఁ దలంతునా ?

రాముఁడు—సుమిత్రాపుత్రా! నారాజ్య భ్రంశము నీ కింత యుద్వేగమును గలిగించినది. ఎఱుకచాలనివాఁడవుగదా నీవు!

ఆ. నాకొ లేక భరతునకొ రాజ్య మబ్బె, నిం
దెవరి కబ్బె నేమి యేకమ కద!
భుజబలంబు నెఱపి ప్రజఁ బ్రోవఁ జక్క స
హాయపడుము భరతుఁ డగును రాజు.

లక్ష్మణుఁడు—రోషోద్రేకము నణఁచుకొనఁ జాలకున్నాఁడను. కానీ! కానీ! అరిగెదఁగాక!

(వెల్వెడలు)

రాముఁడు

ఆ. మూఁడులోకములను ముట్టించి యొకపెట్ట
తగులఁబెట్ట నున్నదానిఁ బోలె
లక్ష్మణన్న కదె! లలాటపుటమ్మును
గ్రమ్మి బొమ్మముడి పొగల్ రగిల్చె.

సుమిత్రాపుత్రా! ఇటు రావోయి!

లక్ష్మణుఁడు—అన్నా! ఇదిగో వచ్చితిని.

రాముఁడు—నీమనసు నిబ్బరము చెందుటకై య ట్లంటిని. దీని కిప్పుడు బదులు చెప్పుము.

మ. జనకున్ సత్యరతున్ వధించుటకునై
చాపంబు సంధింతునా?
తనసొమ్ము౯ గొనఁజూచు తల్లి పయి న
స్త్రంబుల్ ప్రయోగింతునా?
అనుజు౯ నిష్కలుషాత్మకు౯ భరతు సం
హరింతునా? నీ మనం
బునకు౯ వచ్చిన దేది పాతకము లీ
మూఁడింటిలోఁ దమ్ముఁడా?

లక్ష్మణుఁడు—(కన్నీళ్ళు జాఱఁగా) హా! అయ్యో! అన్నా! నా దుఃఖవిషయ మెఱుఁగక దూఱుచుంటివి గదా!

ఆ. లేకపోవుఁగాక నీకు రాజ్యమ్ము; నా
కంత దానికొఱకుఁ జింత లేదు;
ఏండ్లు పదియునాలు గిలు వీడి యడవి నీ
వధివసింప వలయు నఁట గదన్న!

రాము—ఓహో! నాయనగారిందువలన మూర్ఛిల్లిరి. ఇసీ! అప్రభుత్వమును ప్రకటించిరి గదా వారు, మైథిలీ!

గీ. ఇపుడు నీ కవదాతిక యిచ్చినట్టి
నారచీరలు గొని తెమ్ము నాకుఁగూడ,
నే నిదే యన్యభూపతుల్ పూననిదియు
నాచరింపనిదియు ధర్మ మాచరింతు.

సీత—ఆర్యపుత్త్రులు పుచ్చుకొండి!

రాము—మైథిలీ! నీ విషయ మేమి?

సీత—నేను మీకు సహధర్మచారిణినిగదా?

రాము—నే నొక్కఁడ నేకదా వెడలవలసినది.

సీత—అందుక నేకదా నేనూ వస్తాననడము?

రాము—అడవులలో వసింపవలెను సుమా!

సీత—అడవులు నాకు మాడువులే అవుతవి సుమండీ!

రాము—అత్తమామలకు శుశ్రూషకూడ నీవు చేయవలసియున్నదిగదా!

సీత—దానికోసమై వేలుపులకు మ్రొక్కుకొంటున్నాను.

రాము—లక్ష్మణా! నీవది నెను నివారింపుము.

లక్ష్మణుఁడు—అన్నా! మెచ్చఁదగినపట్టున నీమెను నివారింపు మనుచుంటివి. నివారింప నే నుత్సహింపను. ఏలన—

ఉ. తారక వెన్నడించును సు
ధాకరు రాహువు మ్రింగునప్పుడున్,
భూరుహ మిర్వొ బ్రుంగ వెస
బ్రుంగును దీవయు, నేన్గు జొంపిలోఁ
గూరుకొనన్ గరేణువును
గూర్కొను, నీమె చరించు ధర్మ మా
తీరున నిన్ను వెన్కొను, స
తీమణి భర్తృసనాథయేకదా!

చేటి—(ప్రవేశించి) అమ్మగారికి జయము! అలంకారసామగ్రిని కాపాడే రేవమ్మగారు మీకు మ్రొక్కి విన్నవించుకొన్నది: "అవదాతిక సంగీత శాలలోనుంచి ఆ నారచీరల్ని చించుక తీసుకు వచ్చింది. ఇవిగో, ఇవి ఉపయోగపరచనివి, కొత్తవి; వేరే ఉన్నవి. మీరు వీటిని ఉపయో గించుకోవచ్చును" అని.

రాము—అమ్మా! ఇటు తెమ్ము. మీయమ్మగా రింతకుముందు కైకొన్న వానితో సంతోషింతును. ఇవి మాకుఁ గావలెను.

చేటి—చిత్తం!_దొరగారు! తీసుకోండి!

(ఇచ్చి వెళ్ళును)

రాము—(గ్రహించి తాల్చును.)

లక్ష్మ—అన్నా! మన్నింపుము.

గీ. వస్త్ర భూషణ మాల్యాది వస్తువులను
ముందుగాఁ జక్క నగ మిచ్చుచుందు వెపుడు
నిప్పు డటు నాకు వల్కల మీయకుండ
నొక్కఁడవె తాల్చి తిది యేమియుక్త మన్న?

రాము—మైథిలీ! ఈతని నివారింపుము.

సీత—సౌమిత్రీ! ఊరుకోవయ్యా.

లక్ష్మణుఁడు—

గీ. అమ్మ! నీ కొక్కరితకె మా యన్నగారి
యడుగుఁదమ్ముల సేవింప నాస్థ యగునె?
కుడియడుగు నీకెయగుఁగాక, యెడమయడుగు
పడయఁగానిమ్ము న; న్నెడమడుగు వలదు.

సీత — ఆర్యపుత్త్రులు కరుణించవలెను. సౌమిత్రి సంకటపడుతున్నాడు.

రాము — సౌమిత్రీ! వినుము, వల్కలములనఁగా,

గీ. కళ్ళె మింద్రియములను కంఖాణములకు
నంగరక్ష తపం బను సంగరమున,
కంకుశము వినయమం బను హస్తి కింక
ధర్మరథము సారథి దీనిఁ దాల్పవోయి!

లక్ష్మ — అనుగృహీతుఁడను.

(గ్రహించి తాల్చును)

రాము — ఈ వృత్తాంతమును విని పౌరులు రాజమార్గమున క్రిక్కిఱిసియున్నారు! త్రోవ తొలఁగుఁడు! త్రోవ తొలఁగుడు!

లక్ష్మ — అన్నా! నేను ముందు నడచెదను. త్రోవ తొలఁగుఁడు! త్రోవ తొలఁగుఁడు!

రాము — మైథిలీ! ముసుఁగును దీసి వేయుము

సీత — చిత్తము. ఆర్యపుత్త్రు లానతిచ్చినట్లు!

(తీసి వేయును)

రాము—ఓహో! పౌరులార? వినుండు! వినుండు!

ఉ. ఆజ్ఞ యొకింత లేదు కనుఁ
డయ్య! కనుం! డిదె నాదుభార్య, బా
ష్పజ్ఞపితవ్యథంబు లగు
వక్త్రములం బ్రజలార! సర్గతా
వజ్ఞ మగున్ గనుంగొనఁగ
వచ్చును గాంతల నెల్లవారికిన్
యజ్ఞమునన్, వివాహమున,
నాపదయం, దటవీస్థలంబునన్.

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) బాబూ! వెడలవలదు. వెడలవలదు. వీరుగో మహారాజులుంగారు!

చ. అడవులకున్ సతీమణి స
హాయముగాఁ జనుచుంటి వీ వటం
చడుగక లక్ష్మణుండును స
హోదరభక్తిని వెంబడించె నం
చడలుచు నాలకించి నృపుఁ
డంగము ధూళిని బ్రుంగి క్రుంగ వ

చ్చెదు నిదె! కాననంబు విడి
చెచ్చెర వచ్చెదు నేనుఁగో యనఁ.

లక్ష్మ—అన్నా!

గీ. నారచీరలు దాల్చి వనప్రవాస
మరుగు మన కిప్పు డేమి దృశ్యంబు గలదు?

రాముఁడు—

అడవులకు మన మేఁగంగ, నవల వచ్చె
జేఁడు మన యున్కిపట్లు దర్శించుఁగాక!

(అందఱును వెడలిరి)

ఇది ప్రథమాంకము.

---

# ప్రతిమా నాటకము

## ద్వితీయాంకము

---

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచు—ఓహో! ఎవరు! ద్వారముగాచు చున్న వాండ్రు? మీరుమీరు మీమీస్థానములందు జాగ్రత్తతో నుండుఁడు!

ప్రతీహారి—(ప్రవేశించి) అయ్యో! ఇ దేమిటి?

కాంచు—ఇదియా? మహారాజులుంగారు సత్యవాక్యరక్షణపరులై యరణ్యమునకు వెడలు చున్న రామచంద్రమూర్తిని మరలింపఁజాలక పుత్త్రవిరహశోకాగ్నిచే దగ్ధహృదయులై పిచ్చి వానివలె హెచ్చు ప్రలాపించుచు సముద్రగృహ మునఁ బండుకొన్నారు. అక్కడ—

చ. కడఁగి యుగాంతకాలమునఁ
గంపిలు మేరుమహీధరంబుకై

వడిఁ, గలగుండుగా నపురఁ
బాఱు మహోదధిపోల్కి, బింబమా
త్రుఁ డయి మహార్చులం దొరఁగి
తూలెడు సూర్యునిరీతి, నెమ్మనం
బెడరున గ్రుంగ, నంగ మిఱి
యింపులఁ గంపిల ఁడు వాడెడుఁ.

ప్రతీహారి—అయ్యో! అయ్యో! మహా
రాజులుంగా రిటువంటి అవస్థలో ఉన్నారా?

కాంచుకీయుడు—అమ్మా! పొమ్ము.

ప్రతీహారి—అయ్యా! వెళ్తున్నాను. (వెళ్లును)

కాంచు—(అంతటఁ గలయం జూచి) ఎంత
కష్టము! శ్రీరామనిర్గమనదినము మొదలుకొని
యీ యయోధ్య నట్టిపోయినట్టుగానే కానవచ్చు
చున్నది. ఏ లనఁగా—

సీ. కవణంబు గైకోక గంధేభయూథంబు
బృంహితంబులు మాని బీదవడియె
మోరఁ గన్నీరు జాల్వాఱఁ దుక్ఖారముల్
వసివాడె హేషారవంబు దక్కి

పౌరు లెల్లరును స్త్రీ బాలవృద్ధులతోడ
దీనదీనాస్యులై దిగులు గుడిచి
రాహారమును మాని హాహా యటంచు గ
గ్గోలుగా నెలుఁగెత్తి కూయు లిడుచు
తోడరి రాముండు కులకాంతతోడ భూమి
జాతతో, భ్రాతతోడ లక్ష్మణునితో వ
నమ్మునకు నేఁగుచున్న మార్గమ్ముబడినె
కాంచు చుండిరి గన్నీరు నించుచుండి.

నేను సదిగో మహారాజులుంగారిని జేరఁ బోయెదను. (పరిక్రమించి చూచి) ఓహో! వీరె మహారాజులుంగారు! మహాదేవిగారును, సుమిత్రా దేవిగారును మిక్కిలి దుస్సహ మయిన దయినను పుత్త్రవిరహశోకమును నిగ్రహించుకొని తమ్ము నోదార్చుచుండఁగా వారితో నిక్కడ నున్నారు. ఈ యవస్థ కష్టముగా నున్నదిగదా! వీరు, ఈ మహారాజులుంగారు!

ఆ. అయ్యయో! యయో! యటంచుఁ బేరెలుఁ
వాచఱచుచు లేచిలేచి పడును [గున

క. విడనాడె రామచంద్రుఁడుఁ
జెడనాడెను లక్ష్మణుండు క్షితితలమందుఁ
గడు దుర్దశమునకుం బా
ల్పడిన ననుఁ నీవుగూడ వర్జించితివే !

పుత్త్రా! రామ! నాయనా లక్ష్మణ! బిడ్డా వైదేహీ! నాకు బదులు పలుకుండబ్బలారా! శూన్య మిది. అయ్యో! నా కొక్కరును బదులు పలుకకున్నారు. కౌసల్యాతనయా! ఎక్కడ నున్నాఁడవు?

గీ. సత్యసంధ! విమత్సర! శాంతహృదయ!
సర్వలోకాభిమత! గురుజన విధేయ!
రమ్యసుగుణాభిరామ! శ్రీరామ! రామ!
పలుకఁగదవన్న నాకొక్క బదులుపలుకు!

అయ్యో! సర్వజన హృదయనయనాభిరాము డగు నారాముఁ డెక్కడ? ఆ పితృవాక్యానువర్తనం డెం దుండె? శోకార్తులయెడ నా యనుకంప యే మయ్యె? రాజ్యైశ్వర్యమును తృణమువలె లెక్కసేయని నాతండ్రియేఁడి? నాయనా! రామా! వృద్ధుఁ డగుతండ్రిని నన్ను విడిచి, యసంబద్ధమగు

ధర్మమును నీ వేల యనుచరింపవలెనోయీ?
అయ్యో! ఇసిరో! కష్టమయ్యో!

గీ. సూర్యున క్లేఁగె రాముండు సూర్యు నంటి
యరుగుదినమట్లు లక్ష్మణుం డనుగమించె
రవియును దినంబు వెడలినయవల ఛాయ
గానరానట్లు సీతయుఁ గానరాదు.

(పయికిఁ జూచి) ఓ! కృతాంతహాతకా!

గీ. గోడ్డుఁబోతుఁగా మమ్మును, దొడ్డతేసి
కన్యనను నెవ్వసికొ రాము నాత్మజుసఁగ,
నడవిఁ బులిఁ గాఁగఁ గైకేయి నర్ర రీతి
మూఁడు నిటు లేలయా చేయఁజూడ వైతి?

కౌసల్య—(ఏడ్చుచు) ఊరుకొండి, నిబ్బ రించుకొండి యింక. మీరింతగా సంతాపపడుతూ పారవశ్యం తెచ్చుకోవడంతగదు. కోడలు, కుమాళ్లు మీరు మాట యిచ్చినకాలము దాటగానే వస్తారు. చూడవచ్చును.

రాజు—ఓసీ! ఎవతెవే నీవు?

కౌసల్య—మీదయకు తప్పిన కొడుకును గన్నతల్లిని నేను.

రాజు—ఏమీ ! ఏమీ ! సర్వజన నయన హృదయాభిరాముఁ డయిన రామునకుఁ దల్లివి కౌసల్యవా !

కౌసల్య—దేవా ! ఆ దురదృష్టవంతురాలనే నేను.

రాజు—కౌసల్యా! సారవతివిగదవే! రాముని గర్భమున ధరించితివి.

ఆ. అగ్ని తుల్య మమిత మతిదుస్సహంబు దుః
ఖంబు నన్ను మిగులఁ గాల్చుచుండె
సంహరింపఁజాల సహియింపనుం జాల
నెట్టులోర్తు ! ప్రముషితేంద్రియుండ !

(సుమిత్రను జూచి) వేఱొకతె ఇది యెవర్తె ?

కౌసల్య—నాయన లక్ష్మణుని—(అర్ధోక్తిలో)

రాజు—(తొందరతో లేచి) ఏఁడీ ? ఎక్కడ, లక్ష్మణుఁ డెక్కడ ? లేఁడే ? అయ్యో కష్టము !

(రాణులు తొట్రుపాటుతో లేచి రాజును బట్టుకొందురు.)

కౌసల్య—కాదండీ ! నాయన లక్ష్మణునితల్లి సుమిత్ర అని చెప్పఁబోతిని.

రాజు—ఓసి సుమిత్రా!

ఆ. ఓసి! నీ కుమారుఁడే సత్కుమారకుం
డగు; న దే మనంగఁ బగలు రేయు
రామచంద్రమూర్తి రఘువంశదీపకు
నీడవోలె నతఁడు వీడకుండె.

కాంచుకీ—(ప్రవేశించి)మహారాజులుంగారికి జయము. వీరుగో! పూజ్యులగు సుమంత్రులవారు విచ్చేసిరి.

రాజు— (తొందరతో లేచి) రామునితో వచ్చెనా?

కాంచుకీ—లేదు. రథముతో వచ్చెను.

రాజు—ఏమీ! ఏమీ! రథముతోనా? వట్టిరథముతోనా? (అని మూర్ఛితుఁడై పడును)

రాణులు—దేవా! ఊరడిల్లుఁడి. ఊరడిల్లుఁడి.

(అవయవములఁ దడవుదురు.)

కాంచుకీ—అయ్యో! కష్టము! ఇటువంటి మహాపురుషులుగూడ నిటువంటియాపదను బొం

ముదు రనఁగా విధి యెంత యనతిక్రమణీయ మన్న మాట! మహాప్రభూ! ఊఁటడిల్లుఁడు, ఊఁటడిల్లుఁడు.

రాజు—(ఇంచుక తెప్పతిల్లి) బాలాకీ! సుమంత్రుఁ డొక్కఁడేకదా వచ్చినది?

కాంచుకీ—అవును.

రాజు—అయ్యో! కష్టము!

ఆ. రథము శూన్య మై పరావృత్త మయ్యెనా?
నా మనోరథంబు నష్ట మయ్యె
అనిపె నేమొ దశరథునిఁ దోడుకొని పోవు
పొంటె రథముఁ గాలపురుషుఁ డిపుడు.

అట్లని శీఘ్రముగాఁ దోడ్కొని రమ్ము.

కాంచుకీ—చిత్తము. మహారాజులుం గారి సెలవుప్రకారము. (వెళ్ళును)

రాజు—

అడవినెత్తిమ్మికొలఁకుల సుడిసి వచ్చు
కమ్మఁదెమ్మెరల్ భాగ్యవంతమ్ము గాదె
తనివు జనయింప నయ్యావి తాఁకుచుండు
నడవిఁ దిరుగాడు శ్రీరామునంగకముల.

(అంత సుమంత్రుఁడు ప్రవేశించును)

సుమం—(అంతటను గలయఁజూచి శోకముతో)

మ. తమ కృత్యమ్ములు వీడి భృత్యజను ల
త్యంతంబు నెయ్యంబు తి
య్యము పెంపొందినరామచంద్రు నెడఁబా
యక లేక శోకాగ్ని యం
గములుం గాల్పఁగఁ గన్ను లశ్రులఁ దొలం
కన్ దీనదీనాస్యులై
గములై బెగ్గిలి యేడ్చుచున్న నృపతిన్
గర్హించుచున్నా రహో!

(చేరఁబోయి) మహాప్రభూ! జయము.

రాజు—

సీ. అన్నా! సుమంత్ర! నా యగ్రపుత్త్రుఁడు—
కాదుకాదు తప్పుగాఁ బలికితిని.

సీ. అన్నా! సుమంత్ర! నీయగ్రపుత్త్రుఁడు రాముఁ
డెచ్చట నున్నాఁడొ యెఱుఁగఁజెప్పు
అల విదేహాధీశు ననుఁగుఁగూఁతురు గురు
శుశ్రూషు విప్పఁ డెచ్చోట గలదు?

భ్రాతృసేవైకతత్పరచిత్తవృత్తియౌ
సౌమిత్రి తాను నెచ్చటఁ గలండు?
మరణ మాసన్నమై దురపిల్లుచున్నట్టి
చెన్నఁటితండ్రిని నన్నుఁగూర్చి
సకలలోక శోకసాగర సంక్షోభ
కరము గాఁగ నేమి గాని నీకుఁ
జెప్పి పంపినారొ యిప్పు డద్దానిని
దప్పకుండ నాకుఁ జెప్పు మన్న!

సుమం—మహాప్రభూ! వలదువలదు. అమంగళవచనముల నిట్లు పలుకవలదు. అచిరముననే వారిని మీరు చూడఁగలరు.

రాజు—అగును. నే నయుక్తముగానే యడిగితిని. అది తపస్వులవిషయమున నడుగఁదగిన ప్రశ్నము గాదు. ఇఁకఁ జెప్పుము. తపస్వుల తపస్సు వర్ధిల్లుచున్నదా? అరణ్యములు స్వాధీనము లయ్యెనా? అక్కడఁ దిరుగుచో వైదేహి క్లేశపడుట లేదుగద!

సుమిత్ర—సుమంత్ర! నారచీరల లుంగలు ఒంటినిండా ధరించుకొని పసిబాల అయి ఉండి

కూడా ఆరి తేరినవారి నడవడిక నేర్చుకొన్న మా సీతమ్మ అడవులలో పెనిమిటికి సహధర్మచారిణి అయి మమ్ములనుగూర్చి మహారాజులుంగారినిగూర్చి ఏమయినా చెప్పిపంపిందా?

సుమం—అందఱును మహారాజులుంగారిని గూర్చియే—

రాజు—ఆఁగు. ఆఁగు. శ్రోత్రరసాయనములు నాకు హృదయాతురౌషధములును అయిన వారి నామధేయములను వేర్వేఱుగనే చెప్పుము.

సుమం—మహాప్రభువుల సెలవుప్రకారము. చిరంజీవి రామమూర్తి.

రాజు—రామమూర్తి అనియా, వీఁడుగో రాముఁడు. వానినామమును విన్నంతనే నాకు వానిని దాఁకిన ట్లున్నది. ఇఁక, ఇఁక—

సుమం—చిరంజీవి లక్ష్మణుఁడు.

రాజు—వీఁడుగో లక్ష్మణుఁడు. ఇఁక ఇఁక.

సుమం—ఆయుష్మతి సీత, జనకరాజపుత్రి,

రాజు—ఇదిగో వైదేహి. రాముఁడు, లక్ష్మ ణుఁడు, వైదేహి అని యీవరుస సరిగాదు.

సుమం—ఇఁక వరుస యెట్లు?

రాజు—రాముఁడు, వైదేహి, లక్ష్మణుఁడు అని చెప్పవలెను.

ఆ. ఇడుమ లడవులందుఁ గడుఁ గల్గు మాయమ్మ
కాఁపు గల్గి యుండఁగా వలయును
నామసంగ్రహణముననుగూడ రామ ల
క్ష్మణుల నడుమ సీత మసలుఁగాత!

సుమం—చిత్తము. మహాప్రభువుల సెలవు ప్రకారమే. చిరంజీవి రామమూర్తి.

రాజు—వీఁడుగో రామమూర్తి.

సుమం—ఆయుష్మతి జనకరాజపుత్త్రి

రాజు—ఇదిగో వైదేహి.

సుమం—చిరంజీవి లక్ష్మణుఁడు.

రాజు—వీఁడుగో లక్ష్మణుఁడు. రామ! వైదేహీ! లక్ష్మణ! కౌఁగిలించుకొనుఁడు నన్ను బిడ్డలారా!

మధ్యాకర—

ఒకమాఱు తనుపారఁ గౌఁగిలింతునో
యొద్దఁ జేర్చుకొని
యొకమాఱు కనులారఁ గాంతునో రాము
నొప్పులకుప్ప
వికలజీవితుఁ డమృతమున జీవించు
విధమున నేను
సుకపడి మరల జీవింతు నని తలం
చుచు నున్నవాఁడ.

సుమం—శృంగిబేరపురమున రథముననుండి దిగి యయోధ్యాభిముఖులై నిలుచుండి యంద ఱును మహారాజులుంగారికిఁ దలతో నమస్క రించి విన్నవించుకొన నుపక్రమించిరి.

ద్వి. తడ వేదియో చెప్పఁ దలపోసి; రపుడు
వడఁకెను నోడువంగ వాతెఱగూడ
అప్పళించెను గంఠ మంతఁ గన్నీరు
చెప్పకే యడవికిఁ జేరిరి వారు.

రాజు—ఏమీ! ఏమియుఁ జెప్పకుండనే యడవి కేఁగిరా?

(అని కట్టింపు మోహమును జెందును)

సుమం—(తొట్రుపాటుతో) బాలాకీ! మహా రాజులుంగారు అప్రతీకార మయిన యవస్థలో నున్నా రని యమాత్యులకుఁ దెలుపుము.

కాంచుకీ—అట్లే. (వెళ్ళును)

రాణులు—దేవా! ఊరడిల్లండి! ఊరడిల్లండి.

రాజు—(ఇంచుక యూఱడిల్లి)

గీ. సంస్పృశింపుము నన్నుఁ గౌసల్య! నిన్నుఁ
గాంచుటకు నాదుకనుదోయి కానరాదు
అరిగె శ్రీరామచంద్రునిదరికి మనము
మరలి రా దిప్పటికి నందె మరగియుండె.

నాయనా! రామా! ఎడతెగక నే నిదే తల పోసితినిగదోయీ!

సీ. కానక కన్న సంతానమ్ము నిన్ను సు
శ్రీ రాజ్యమున నభిషిక్తుఁ జేసి
రక్షింపఁగల దొడ్డ రాచగున్న లభించు
కతమునఁ బ్రజఁ గృతార్థతకుఁ దార్చి
తమ్ముఁగుఱ్ఱల సంతతము భవత్సమవై భ
వులఁ జేయు మని నీకుఁ దెలియఁ జెప్పి

చింతఁ బోకార్ప విశ్రాంతిఁ జేకూర్పఁ బ
ర్యాప్త మా మునివనాశ్రమముఁ జేరి
జీవితావశేషంబు పోఁద్రోవవలయు
ననుచుఁ దలఁచు నావాంఛితం బక్కటకట!
క్షణములోపల సర్వంబుఁ గణఁగి యన్య
థాకరించెను రాకాసికైక తనయ!

సుమంత్రా! కైకేయికిఁ దెలుపుము.

ఆ. చనియె రాముఁ డనుచు సంతోషపడు మను
మనుజు లెల్ల నాకు నుడిఁగె ననుము
తోడుతోడఁ గొడుకుఁ దోడ్తెచ్చుకొను మను
పాపఫలము తనకుఁ బండె ననుము

సుమం—మహాప్రభువుల సెలవుప్రకారము.

రాజు—(మీఁదికిఁ జూచి) అహహా! రామకథాశ్రవణ సందగ్ధహృదయుఁడ నగు నన్ను నోదార్చుటకుఁ బితరు లరుదెంచిరి! ఎవ రక్కడ?

కాంచుకీ—(ప్రవేశించి) జయము మహారాజులుంగారికి.

రాజు—ఉదకమోయి!

కాంచుకీ—సెలవు ప్రకారము మహాప్రభూ! (నిష్క్రమించి ప్రవేశించి) చిత్తము మహాప్రభూ! ఇదిగో ఉదకము.

రాజు—(ఆచమించి చూచి)

గీ. ఇంద్రునకు నెచ్చెలి దిలీపుఁ డితఁడె! యితఁడె
రఘువు! నాతండ్రి యజమహారా జితండె!
ఏల వచ్చితిరయ్యా మీ రిచటి కిపుడు?
నేనె మిమ్ముఁ జేరవచ్చుచున్నానుగాదె!

రామ! వైదేహి! లక్ష్మణ! నే నిఁక పితరుల సన్నిధికిఁ బోవుచున్నాను! ఓపితరులారా! నేను, ఇదిగో నేను, వచ్చుచున్నాఁడను.

(మూర్ఛలో మునిఁగెను)

(కాంచుకీయుఁడు తెరవైచును.)

అందఱును—అయ్యో! అయ్యో! మహారాజులుంగారు! (నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము

భటుఁడు—వెయ్యిచేతు లుంటే ఏమి చేస్తావురా?

సుధా—నిన్ను సంపేస్తాను.

భటుఁడు—రా ముండకొడకా రా! నిన్ను చంపి వదలిపెట్టుతాను! (మరలఁ దన్నును)

సుధా—(రోదనము చేసి) నావల్ల తప్పేమైనా కనుక్కోఁగల్తివా దొరా! తన్నావు!

భటుఁడు—లేదురా! నీవల్ల తప్పు లేదు. నేను నీతో చెప్పితినిగదా, బాబుగారు రాముల వారికి రాజ్యం పోయిందని మనసుచెడి దశరథ మహారాజులుంగారు చనిపోగా వారిని ప్రతిమా గృహమున దర్శించవలె నని, ఇప్పుడు కౌసల్యమ్మ గారు మొదలయిన జనానావా రంతా ఇక్కడికి వస్తారని! ఇక్కడ నీ విప్పు డేమి చేస్తున్నావురా!

సుధా—చూడు దొరా! లోపలింట్లో పిచ్చిక గూళ్ళు ఎత్తివేశాను. గోడమీఁద నున్నప్పట్లో ఐదేసిఅంగుళాలకు శ్రీచందనప్పట్లు తీర్చినాను. వాకిళ్ళకు తోరణాలు గట్టినాను. ఇసక చల్లినాను. ఇంక ఏమిటయ్యా నేను చేయనిది?

భటుఁడు—అట్లా చేస్తే సరే. పరవాలేదు పో. ఇదుగో నేనూ వెళ్ళి అంతా సనిపరచడ మైనదని అమాత్యులవారికి విన్నవించుకొంటాను.

[వెళ్ళిరి.]

ఇది ప్రవేశకము

[అంత భరతుఁడు, రథముతో సూతుఁడు వత్తురు.]

భరతుఁడు—(ఆవేగముతో) సూత! మేనమామగారియింటఁ జాలనాళ్ళనుండి యుండుటచే వార్త లేమియుఁ దెలియవయ్యెను. మహారాజులుంగారు మిక్కిలి అస్వస్థశరీరులుగా నున్నా రని వింటిని. అది చెప్పుము.

*ఉ. నాయన కేమి వ్యాధి ?

సూతుఁడు—ఎద నాఁటిన పెఁనగచూవె;

భర—ఏమి యంత్రో యది వైద్యులు ?

*ఉ. నాయన కేమి వ్యాధి ? యెద
నాఁటిన పెఁనగచూవె; యేమి యం
ద్రో యది వైద్యు ? లయ్యది కు
దుర్పఁగరానిదిగాదె వారికిఁ ;

సూతు— అయ్యది కుదుర్పఁగ రానిది గాపె వారికిఁ ;

భర—ఓయిర మేమి ?

సూతు—లేద యెదియున్;

భర—శయనంబో ?

సూతు—ధరిత్రిమీఁద;

భర—ఇంకేయది దిక్కు ?

సూతు—దైవము.

భర—ఎదనీఁగెద వేగ రథంబుఁ ద్రోలుమా!

సూతు—బాబుగారి సెలవుప్రకారము.

[వడిగాఁ ద్రోలును]

భర—(రథవేగమును నిరూపించి) బలే! బలే! రథవేగము !

---

ఓయిర మేమి ? లేద యెదియుఁ ;
 శయనంబో ? ధరిత్రిమీఁద ; ఇం
కేయది దిక్కు ? దైవ ; మెద
 నీఁగెద వేగ రథంబుఁ ద్రోలుమా !

చ. పరువిడునట్లు చెట్లు గను
  పట్టెడు వెన్కకుఁ జిన్న చిన్నవై
పొరలి వహించు నేఱువలె
  భూమి చొరంబడు నేమిరంధ్రమం
దరము లెఱుంగరావు, కద
  లాడవొకో యనఁ దోఁచుఁ జక్రముల్
తురగఖురాళి ధూళి వెను
  ద్రొక్కక తేరిదె మీఱి దూఁకెడున్.

సూతు—బాబూ! అల్లదిగో చెట్లు గుబురుకొని శ్యామాయమానములై ఉన్నవే: అదే యయోధ్య కావలెను.

భర—అన్నా! స్వజనదర్శనోత్సుకతచే నా మన సెంత తొందరపడుచున్నది! ఇప్పుడు—

సీ. కడ కేఁగి నాయనగారి పాదమ్ముల
  పయిఁ దలతోడ నేఁ బడినయట్లు
కూర్మిమై నను జేఁదు గ్రుచ్చి యెత్తినయట్లు
  నన్నదమ్ములు చుట్టుకొన్న యట్లు
అశ్రులు రాల మా యమ్మలు పుతపుత
  మన్నట్లు నే జాలిగొన్న యట్లు

వచ్చి భృత్యులు కొల్వఁ జొచ్చిపోలఁగనొద్దుఁ
జిన్న బొదుగుం బెరిఁగె నంచుఁ బొగడినట్లు

అంత మాయన్న సౌమిత్రి చెంతఁజేరి
నాకుఁ గేకయదేశమ్మునను నలవడి
నట్టి వేషభాషణముల నపహసించి
నట్టుసి శ్లిన్నో మదిలోనఁ దట్టుచుండె.

సూతు——(ఆత్మగతము) అయ్యో! కష్టము! ఈచిన్నబాబు మహారాజులుంగారిమరణము నెఱుఁగక, ఉత్తరక్షణమున కిత్తవోనున్న యాశను మోచుచు నయోధ్యను బ్రవేశించుచున్నాఁడు! ఎఱిఁగియుండియు నేను దెలుపనయితిని! ఏ మన–

తండ్రిగారి వపుఃపరిత్యాగ మొకటి
తల్లి యైశ్వర్యసౌభాగ్యవృత్తాంత మొకటి
అన్న వనవాస మొక్కటి యక్కటకట!
ముప్పు లివి మూఁడు నే నెట్లు చెప్పఁగలను?

భటుఁడు——(ప్రవేశించి) బాబుగారికిజయము!

భరతుఁడు——అబ్బీ! ఏమి శత్రుఘ్నుఁడు నన్నెదుర్కొన వచ్చెనా?

భటు——బాబుగారు ! వా రదిగో వచ్చుచున్నారు. ఉపాధ్యాయులవారు ముందు మీా కిట్లు సెల విచ్చిరి.

భర——ఏ మని? ఏ మని?

భటు——"కృత్తికానక్షత్ర మింక నొక్క గడియ గలదు. కావున నీగడియ గడచి రోహిణీ నక్షత్రము వచ్చినతర్వాతనే నగరప్రవేశము చేయ వచ్చును" అని.

భర——మంచిది. అట్లులే చేయుదును. నేనెన్నడును గురువచమును మీాఱలేదు. నీవు పొమ్ము.

భటు——బాబుగారిసెలవుప్రకారము(వెళ్లును)

భర——ఇప్పు డెచ్చోటవిశ్రమింతురు ? కాని! చూచితిని. ఈచెట్లచాటునఁ గనుపట్టుచున్న దేవళమున నీగడియసేపు విశ్రమింతును. దేవపూజయు, విశ్రాంతియు రెండును గలసివచ్చును. అదియుఁ గాక ఊరిబయట . . . . విశ్రాంతిఁ గొని నగరములలోఁ బ్రవేశించుట పెద్దల యాచారము. కనుక రథము నాఁపుము.

సూతు—బాబుగారి సెలవుప్రకారము.

[రథము నాపును]

భర—(రథముననుండి దిగి) సూత! గుఱ్ఱములను విడిగా విశ్రమింపఁజేయుము.

సూతు—బాబుగారి సెలవుప్రకారము.

[వెళ్ళును]

భర—(కొంచెము నడచి చూచి) లెస్సగాఁ బూవులచేతను, బ్రేలాలచేతను బలు లుంచినారు. గోడలపై నైదేసి యంగుళములకుఁ జందనపుఁ బట్టెలు వెట్టినారు. ద్వారముల కెల్ల మాల్యతోరణములు గట్టినారు. ఇసుకఁ జల్లినారు. ఇది యేమయి యుండును? ఏదేని యుత్సవవిశేషమా? లేక యనుదినము సట్టియాస్తిక్యమే యిక్కడ నడచునా? ఇది యే దేవరగుడియో కదా! ఇక్కడ నేదేని యాయుధము గాని, ధ్వజము గాని బహిశ్చిహ్నము గానరాకున్నది. కానీ! ప్రవేశించి చూచెదను. (ప్రవేశించి చూచి) ఆహాహా! ఱాలమీఁది శిల్పసౌందర్య మెంత యబ్బురముగా నున్నది! బలే! ప్రతిమలకు భావవ్యక్తి

యెంత స్పష్టముగా నున్నది! ఈ ప్రతిమలు దైవ తోద్దిష్టము లయినను, మానుష విశ్వాసమును గల్గించుచున్నవి. ఇది చతుర్దైవత మగు స్తోమ మా యేమి? అవి యేవియేని యగుఁగాక! నా మది కెంతో సంతోషము గొల్పుచున్నవి.

గీ. దైవతములే యగుదు రని తలఁచి తలను
వంచి కావించువాఁడ నే వందనంబు
వేల్పుల కమంత్రకమ్ముగాఁ జల్పఁబడిన
వందన మ్మది యగుఁగాదె వార్షలంబు.

దేవకులికుఁడు—(ప్రవేశించి) ఓహో! నిత్య కృత్యాదికము ముగిసినపిదప భోజనమునకు నేను బోయియుండఁగా నీతఁ డెవ్వఁడో కాని యీ ప్రతిమలఁ బోలినవాఁడు ప్రతిమాగృహములోనికి వచ్చెసెను. కానీ! నేనును బోయి తెలిసికొందును.

భరతుఁడు—(ప్రవేశించి) నమోఽస్తు(ప్రతిమ లకు మ్రొక్కను)

దేవ—వలదు వలదు. మ్రొక్కవలదు.

భర—అయ్యో! ఏల వల దన్నెదవు?

వచ్చి భృత్యులు కొల్వఁ జొచ్చిపోలఁగనొడ్డుఁ
బ్రొద్దు బోడుగుం బెరిఁగె నంచుఁ బొగడినట్లు

అంత మాయన్న సౌమిత్రి చెంతఁజేరి
నాకుఁ గేకయదేశమ్మునను నలవడి
నట్టి వేషభాషణముల నపహసించి
నట్టుని ల్లెన్నొ మదిలోనఁ దట్టుచుండె.

సూతు—(ఆత్మగతము) అయ్యో! కష్టము! ఈచిన్నబాబు మహారాజులుంగారిమరణము నెఱుఁగక, ఉత్తరక్షణమున రిత్తవోనున్న యాశను మోచుచు నయోధ్యను బ్రవేశించుచున్నాఁడు! ఎఱిఁగియుండియు నేను దెలుపనయితిని! ఏ మన—

గీ. తండ్రిగారి వపుఃపరిత్యాగ మొకటి
తల్లి యైశ్వర్యలౌభ్యవృత్తాంత మొకటి
అన్న వనవాస మొక్కటి యక్కటకట !
ముప్పు లివి మూఁడు నే నెట్లు చెప్పఁగలను ?

భటుఁడు—(ప్రవేశించి) బాబుగారికిజయము!

భరతుఁడు—అబ్బ ! ఏమి శత్రుఘ్నుఁడు నన్నెదుర్కొన వచ్చెనా ?

భటు___బాబుగారు! వారదిగో వచ్చుచున్నారు. ఉపాధ్యాయులవారు ముందు మీకిట్లు సెలవిచ్చిరి.

భర___ఏమని? ఏమని?

భటు___"కృత్తికానక్షత్ర మింక నొకగడియ గలదు. కావున నీగడియ గడచి రోహిణీనక్షత్రము వచ్చినతర్వాతనే నగరప్రవేశము చేయవచ్చును" అని.

భర___మంచిది. అట్లులే చేయుదును. నేనెన్నడును గురువచమును మీఱలేదు. నీవు పొమ్ము.

భటు___బాబుగారిసెలవుప్రకారము(వెళ్లును)

భర___ఇప్పు డెచ్చోటవిశ్రమింతురు? కానీ! చూచితిని. ఈచెట్లచాటునఁ గనుపట్టుచున్న దేవళమున నీగడియసేపు విశ్రమింతును. దేవపూజయు, విశ్రాంతియు రెండును గలసివచ్చును. అదియుఁగాక ఊరిబయటఁ గొంత విశ్రాంతిఁ గొని నగరములలోఁ బ్రవేశించుట పెద్దల యాచారము. కనుక రథము నాఁపుము.

సూతు—బాబుగారి సెలవు ప్రకారము.

[రథము నాఁపును]

భర—(రథముననుండి దిగి) సూత! గుఱ్ఱములను విడిగా విశ్రమింపఁజేయుము.

సూతు—బాబుగారి సెలవుప్రకారము.

[వెళ్ళును]

భర—(కొంచెము నడచి చూచి) లెస్సగాఁ బూవులచేతను, బేలాలచేతను బలు లుంచినారు. గోడలపై నైదేసి యంగుళములకుఁ జందనపుఁ బట్టెలు వెట్టినారు. ద్వారముల కెల్ల మాల్య తోరణములు గట్టినారు. ఇసుకఁ జల్లినారు. ఇది యే మయి యుండును? ఏదేని యుత్సవవిశేషమా? లేక యనుదినము నట్టియా స్తిక్యమే యిక్కడ నడచునా? ఇది యే దేవరగుడియో కదా! ఇక్కడ నేదేని యాయుధము గాని, ధ్వజము గాని బహిశ్చిహ్నము గానరాకున్నది. కానీ! ప్రవేశించి చూచెదను. (ప్రవేశించి చూచి) ఆహాహా! శాలమీఁది శిల్పసౌందర్య మెంత యబ్బురముగా నున్నది! బలే! ప్రతిమలకు భావవ్యక్తి

యెంత స్పష్టముగా నున్నది! ఈ ప్రతిమలు దైవతోద్దిష్టము లయినను, మానుష విశ్వాసమును గల్గించుచున్నవి. ఇది చతుర్దైవత మగు స్తోమ మా యేమి? అవి యేవియేని యగుఁగాక! నా మది కెంతో సంతోషము గొల్పుచున్నవి.

గీ. దైవతములే యగుదు రని తలఁచి తలను
వంచి కావించువాఁడ నే వందనంబు
వేల్పుల కమంత్రకమ్ముగాఁ జల్పఁబడిన
వందన మ్మది యగుఁగాదె వార్షలంబు.

దేవకులికుఁడు—(ప్రవేశించి) ఓహో! నిత్యకృత్యాదికము ముగిసినపిదప భోజనమునకు నేను బోయియుండఁగా నీతఁ డెవ్వఁడో కాని యీ ప్రతిమలఁ బోలినవాఁడు ప్రతిమాగృహములోనికి విచ్చేసెను. కానీ! నేనును బోయి తెలిసికొందును.

భరతుఁడు—(ప్రవేశించి) నమోఽస్తు(ప్రతిమలకు మ్రొక్కును)

దేవ—వలదు వలదు. మ్రొక్కవలదు.

భర—అయ్యో! ఏల వల దన్నెదవు?

గీ. తప్పునాయందు నేదేని చొప్పడియెనొ?
ముఖ్యులు మఱెవ్వరే మును మ్రొక్కవలెనొ?
ఏల వల దంటివయ్యా నా కెఱుఁగఁ జెప్పు
లేక నీ కిదే నియమనిష్ఠాకలనమొ?

దేవ—మిమ్ముఁ బ్రతిషేధించినది యీ కార ణములచేతఁ గాదు. ఏమనఁగా దేవత లను తలఁ పుతో బ్రాహ్మణజనము నమస్కారము చేయు చుండె నని ప్రతిషేధించితిని. ఈ ప్రతిమలు క్షత్రి యులవి.

భర—అగును. ఈ ప్రతిమలు క్షత్రియులవే కాని యేక్షత్రియులు వీరు ?

దేవ—ఇక్ష్వాకులు.

భర—(సంతోషముతో) ఇక్ష్వాకులా? అ యయోధ్యాధీశ్వరులుగదా వీరు !

ఉ. తోడగుచుంద్రు రక్కసులఁ
ద్రుంప నిలింపుల కీ మహారథుల్
వాడలతోడ నీ సుకృత
వంతులు సొత్తురు దేవలోకముల్

పీడని బాహుదర్పమున
విశ్వము గెల్చి చిరంబు ప్రోచి యీ
ప్రోడలు స్వేచ్ఛమైఁ దనువు
పుత్త్రరు మృత్యు వోడింగి నిల్వఁగన్.

ఓహో! యాదృచ్ఛికముగా నేను గొప్పఫలమును బడసితినిగదయ్యా! తెలుపుము! మీ రెవరు?

దేవ—వీరా? సర్వరత్నములను సాధించి విశ్వజిద్యాగమును జేసినవారు, ప్రజ్వలితధర్మప్రదీపులు దిలీపులవారు.

భర—ధర్మమూర్తికి నమస్కారము. తెలుపుము! మీ రెవరు?

దేవ— వీరా? శయనింపఁ బోవునప్పుడు, మేలుకొనినప్పుడు బ్రాహ్మణ జనసహస్రములచే పుణ్యాహశబ్దరవమును వినుచుండినవారు, రఘువులవారు.

భర—ఆహా! బలవంతమగు మృత్యువు ఇట్టిగట్టిరకమునుగూడఁ దప్పించుకొని మట్టుకొనెను గదా! బ్రాహ్మణజనులకు రాజ్యఫల మర్పించిన ధర్మాత్మునకు వందనము. తెలుపుము! మీ రెవరు?

దేవ—వీరా ? ప్రియావియోగనిర్వేదముచే రాజ్యభారమును విడనాడినవారు, నిత్యము నవ భృథస్నానములఁ జేసి నిష్కలుషులై నెగడిన వారు, అజులవారు.

భర—శ్లాఘనీయపశ్చాత్తాపుఁ డయినమహనీయునకు నమస్కారము. (దశరథుని ప్రతిమను జూచుచు వ్యాకులపడి) అయ్యో! మనసు బహుమానవ్యాక్షిప్తమయి యుండుటచే విస్పష్టముగా గుర్తింపఁజాలకున్నాఁడను. తెలుపుము! వీ రెవరు?

దేవ—వీరు దిలీపులవారు.

భర — మహారాజులుంగారి పి తృ పి తా మహుఁడు. తరువాత, తరువాత?

దేవ—వీరు రఘువులవారు.

భర—మహారాజులుంగారి పితామహుఁడు. తర్వాత ?

దేవ—వీ రజులవారు.

భర—నాయనగారితండ్రి! ఏమంటివి? ఏమంటివి ?

దేవ—వీరు దిలీపులు, వీరు రఘువులు, వీ
రజులు— “ధరమాణానాషూపి స్త్ర త్రివర్గాః స్థావస్త్రే

భర—సి న్నించుక యడుగుచున్నాఁడను.
బ్రదికి యున్న వారిప్రతిమలుగూడ నిలుపుదురా?

దేవ—నిలుపరు; వెళ్ళిపోయినవారివే.

భర—అందుచేతనే యడుగుచున్నాఁడను.

దేవ—ఉండుము.

గీ. అయ్యా! స్త్రీశుల్కమునకునై యవనిభరము
తోడఁ బ్రాణమ్ములనుగూడ వీడుకొనియె
నెవ్వఁ డట్టి దశరథమహీతలేంద్రు
ప్రతిమ దీనిఁ బ్రశ్నింపవు, కత మదేమి?

భర—హా! నాయనా!

(మూర్ఛితుఁడై పడును. మరల తెలివి తెచ్చుకొని)

మ. మనమా! తెప్పిలుమా! యెదేఁ దలఁచి సం
బ్రాంతంబ వొందుంటివో,
వినుమా దానిని దండ్రిగారి మృతిదు
ర్వృత్తాంతముఁ, ధైర్యముఁ

గోనుమా! నీచపురుషులకు-శబ్దమది నా
కుఁ దాఁకునో యేమొ! నే
ననుమానింపక దేహశోధనము సే
యంగావలెఁ దానికై.

ఆర్యా!

దేవ—ఆర్యా యను పిలుపిది యిక్ష్వాకు వంశ్యుల పిలుపుగదా! కైకేయీపుత్త్రి లగు భరతులా మీరు!

భర—అగును. ఆర్యా! అగును. దశరథ పుత్త్రుఁడను భరతుఁడను నేను; కైకేయీ పుత్త్రుఁడను గాను.

దేవ—అయిన నొకటి యడుగుచున్నాను.

భర—అఁగుము. కడమ చెప్పుము.

దేవ—ఏమిగతి! చెప్పెద వినుఁడు. దశరథులవారు వెళ్ళిపోయిరి. సీతాలక్ష్మణసహితులై రాములవా రడవి కేలవెడలిరో నాకుఁ దెలియదు.

భర—ఎట్టెట్టూ! ఆర్యుఁ డడవికిఁగూడ నరిగెనా?

(రట్టిఁపు మోహ మందును)

దేవ—బాబూ! ఊఱడిల్లుఁడు, ఊఱడిల్లుఁడు.

భర—(ఊఱడిల్లి)

ఆ. లేరు తండ్రిగారు లేరన్నగారింక
నయ్యయో! యయోధ్య యడవి యయ్యె
ఎండిపోయినట్టియేటికిఁ దృష్ణార్తు
నట్లు నేను బరుగు వెట్టుచుంటి.

ఆర్య! సవిస్తరముగా విషయమును వింటినా నామనసు కుదుటఁబడునూ. కనుక సర్వమును సవిస్తరముగాఁ దెలుపుదువుగాక!

దేవ—వినుఁడు. మహారాజులుంగారు శ్రీ రాములవారికి రాజ్యాభిషేకము చేయనుండఁగా మీతల్లిగారడ్డు పల్కరిగదా!

భర—ఆఁగుము.

సీ. అల శుల్కదోషంబుఁ దలపెట్టి పట్టంబు
గట్టఁగావలయు నాపట్టి కనియొ
తద్ధైర్యమున మది నౌద్ధత్యము వహించి
యడవుల కార్యుని వెడలు మనియె

మాయన్న దాసికి మాఱుమాటాడక
వెలువడె నారచీరలు ధరించి
అది చూడఁగా లేక యవనీతలేశ్వరుం
డసదృశంబుగ నప్పు డసుఱు విడిచె
ప్రకృతు లింకమీఁదఁ బరిపరివిధముల
నాదుతలనె చెడుగుఁ బాదుకొలిపి
తల్లి నడవడికిసి దగినట్లు బలుతిట్లు
తిట్టిపోయకుండు రెట్లు లయయొ!

(మోహమందును)

తెరలో॰

తోవతప్పుకోండి అయ్యా, తోవతప్పుకోండి!

దేవ—(చూచి) అన్నా!

ఆ॰ బిడ్డ మూర్ఛలోనఁ బడ్డాడు, రాణులు
నరుగుదెంచినారు సరిగ నిపుడె
తల్లి చలువచేతితాఁకుడు సంతాప
మార్చు చల్లనీటియంజలిగద!

(అంత రాణులు, సుమంత్రుఁడు ప్రవేశింతురు.)

సుమం—అమ్మలారా! ఇటు, ఇటు.

శా. ప్రాసాదంబులయందు నెందు నిటు సౌ
భాగ్యంబు మృగ్యం బనన్
భాసిల్లెన్ మును మా నృపాలకునియా
వాసంబు నేఁ డట్టి యా
వాసిన్ బాసెను ద్వారపాలకుల ని-
ర్వాహంబు లే దాజ్ఞ లే
దే సత్కారము లేదు శ్రోవరులు దా
రే తెంచుచున్నా రహో!

(ప్రవేశించి చూచి)

అమ్మలారా! వలదు. వలదు. ప్రవేశింప వలదు.

గీ. పడుచుఁ బ్రాయంపువాఁడు భూపాలునట్లు
లుండె నిదె యెవ్వఁడో పడియుండె నిచట?

దేవ—

ఎవ్వఁడో యని సందేహ మేటి కయ్య
యతఁడు భరతుండు మీరింక నాదుకొనుఁడు.

(వెళ్ళును)

రాణు—(తొట్రుతోఁ జేరఁబోయి) అయ్యో! నాయనా! భరతా!

భర — (ఇంచుక యూఁఱడిల్లి) ఆర్యా!

సుమం — జయము మహా — (అర్ధోక్తిలో విషాదముతో) అహో! స్వరసాదృశ్యము! ప్రతిమాస్థు లగు మహారాజులుంగారు మాటాడుచున్నారా యనుకొంటిని.

భర — ఇఁక మాయమ్మగారల కిప్పు డెట్టి యవస్థ వచ్చినది!

రాణులు — నాయనా! మా అవస్థ ఇట్లా ఉన్నది! (ముసుఁగులఁ దొలఁగింతురు)

సుమం — అమ్మలారా! దుఃఖ మాఁపు కొనుఁడు.

భర — (సుమంత్రునిఁ జూచి) అమ్మగార లవకుంఠనము తొలఁగించినప్పుడుగూడ మీరు సన్నిధి నుండుటచే ననుమానించుచున్నాఁడను. మీరు, బాబుగారు, సుమంత్రులవారు గారా?

సుమం — నాయనా! అగును. సుమంత్రుఁడనే

ఉ. చెట్టగదన్న! యిట్టు చిర
జీవితదోషముతే వెసన్ వెసన్

దట్టుచు నుండఁగాఁ గడుఁ గృ
తఘ్నతనుం గుటిలాత్ముఁ నే సిదే
యట్టినృపాలకుండు మృతి
నందినపిమ్మటఁగూడ మొండి నై
పట్టిరథంబుఁ బట్టుకొని
వర్తిలుచుంటిని సూతవృత్తిలోన్.

హా! నాయనా! (లేచి) నాయనా! అమ్మగారల కభివాదనక్రమము నుపదేశింపుఁడు.

సుమంత్రుఁడు—మంచిది. ఈమె నీయన్న శ్రీరాములవారి జనయిత్రి కౌసల్యాదేవిగారు.

భరతుఁడు—అమ్మా! నిర్దోషుఁడను నమస్కరించుచున్నాఁడను.

కౌసల్య—నాయనా! నీవు సంతాపపడవద్దు.

భరతుఁడు—(స్వగతము) ఈపలుకు నన్ను లాగికొనుచున్నది. (ప్రకాశము) అనుగృహీతుఁడను. తరువాత—

సుమం—ఈమె, లక్ష్మణులతల్లి, సుమిత్రాదేవిగారు.

భర—అమ్మా! లక్ష్మణునిచే వంచింపఁబడిన వాఁడను నేను నమస్కరించుచున్నాఁడను.

సుమిత్ర—నాయనా! యశస్సు గడించుకో.

భరతుఁడు—అమ్మా! ఇదిగో! యత్నింతును. అనుగృహీతుఁడను తర్వాత—

సుమంత్రుఁడు—ఈమె నీతల్లి.

భర—(సరోషముగా లేచి) ఛీ! పాపురాలా!

ఆ. హేయముగను దోఁచె మాయమ్మమాయమ్మ
నడుమ నీవు నిల్వ నాకు నెంతొ
కడుఁ బవిత్రము లగు గంగాయమునలకు
నడుమ ముఱికికాల్వ నడచినట్లు. ౭౪.

కైకేయి—నాయనా! నే నేమి చేసినాను?

భర—ఏమి చేసితి నని యడుగుచున్నావా?

సీ. నాచేత దుష్కీర్తి, నాయన్నచే నార
చీరలుంగలు మోవఁజేయలేదా?
మానాయనకు గృహమరణమ్ము, సౌమిత్రి
కడవి నల్లాటమ్ము నిడఁగలేదా?

మమ్ముఁ గూర్మిని బ్రోచునమ్మల నిర్వార
దుఃఖవారాశిలోఁ ద్రోయలేదా ?
కన్నీరు మున్నీరుగా నయోధ్య నదెల్లఁ
జెల్లఁబో యని కుందఁజేయలేదా ?
పేరడవిపట్టులందుఁ బువ్వారుఁబోఁడిఁ
గోడలిని సంకటంబులఁ గుడుపలేదా?
యెంత దుశ్చింతురా లని యెల్ల జగము
రోయరోఁతను నిన్నుఁ దార్చుకొనలేదా ?

కౌసల్య—నాయనా! పెద్దలమర్యాద లన్ని పాటించేవాడవు నీవు మ్రొక్కవేమి మాయమ్మకు?

భర—మాయమ్మయందువా? అమ్మా! నీవే నా కమ్మవు. అమ్మా! నమస్కరించుచున్నాఁడను.

కౌస—కాదుకాదు నాయనా! ఈమెనీతల్లి.

భర—తల్లియే మునుపు. ఇప్పుడు గాదు. చూడు తల్లీ!

శా. పాపాత్మురాం డగునేసిఁ బుత్త్రిసుఁ గృపా
బంధంబు సంధింపకే
తోఁ్రిపాడం దగుఁగాదె తండ్రులు; కపు
త్త్రుం డౌఁగదే వాఁడు; నే

స్థాపింతుఁ భువిఁ గ్రొత్తధర్మమును భ
  ర్తఁ జిక్కులఁ ద్రొక్కుచుం
బాపంపుంబడి నేఁగుమాత కిఁకపై
  మాతృత్వముఁ దీఱుతన్.

కైకేయి—నాయనా! మహారాజులుంగారి సత్యవచనము రక్షించడముకోసము నే నాలా గడిగినాను ?

భరతుఁడు—ఏ మడిగితివి ? ఏ మడిగితివి ?

కైకేయి—నాకొడుకు రాజుగావలె నని అడిగినాను.

భరతుఁడు—అట్టులా! నీకు నాయార్యుఁడు మాత్రి మే మగు ననుకొంటివి ?

గీ. ఔరసుఁడుగాఁడొ మాతండ్రి కతఁడు, మఱియు
  నతనియభిషేక మక్రమ మయిన దగునొ
  అనుకూల్యంబు లేదొ మా కన్నదమ్ము
  లకుఁ ? బ్రియంపడరో మఱి ప్రకృతిజనులు ?

కైకేయి—నాయనా! అనుమతించినశుల్కము నడుగుకొనవలెగదా నేను ?

భరతుఁడు—

గీ. రాజ్యమును వీడి నారచీరలు ధరించి
పాదచారి యై యడవికి భార్యతోడ
వెడలు మని యార్యునకు నాన వెట్టితి వట
శుల్కమున నిత్తెఱఁగుగూడఁ బల్కఁబడెనె?

కైకేయి—నాయనా! చెప్పఁ దగిన చోట చెప్పఁదగినప్పుడు చెప్పుతాను.

భరతుఁడు—

ఉ. దుర్యశమందు వాంఛ గల
దో? మముఁ బేర్కొన నేల? రాజ్యధూర్
ధుర్యతఁ గాంచుకోర్కి గల
దో దయసేయఁడె ఱేఁడు? భూమిభృ
ద్వర్యునిమాత యన్నగరు
వంబు వహింపఁ దలంపు గల్గెనో?
యార్యుఁడు గాఁడొకో కొమరుఁ
డమ్మరొ నీకు యథార్థ మాడుమా!

అయ్యో! ఎంత పని చేసితివే!

ఉ. సీ లల! రాజ్యలోభమునఁ
జేసి హరించితి ఱేనిప్రాణముల్

ప్రోలు దొలంగఁ ద్రోచితివి
  పొమ్మసు కానల కగ్రపుత్త్రుసిఁ
బ్రీలవు నారచీరలు ధ
  రించినజానకిఁ జూచికూడ గుం
డ్రాల నొనర్చెనేమొ విధి
  రట్టడిబండలు నీదుగుండియల్!

సుమంత్రుఁడు—— బాబూ! వీరుగో వసిష్ఠ వామదేవులు ప్రకృతులతో నరుదెంచి మీ యభిషేకమును బురస్కరించుకొని యిట్లు విజ్ఞాపించుకొనుచున్నారు.

గీ. గోపకులకాఁపు లేకున్న గోగణంబు ౭౪
  ప్రోపుమాలి నాశనమును బొందునట్లు
  భూపతులకాపు లేకున్న భూమి ప్రజలు
  ప్రోపుమాలి వినాశంబుఁ బొందఁగలరు.

భరతుఁడు—— ప్రకృతులు నన్ను వెంటాడుదురు గాక!

సుమంత్రుఁడు——అభిషేకమును విడిచి నీ వెక్కడికి వెళ్ళెదవు?

భరతుఁడు—అభిషేకమా? ఇదిగో అమ్మగారికిఁ జేయుఁడు.

సుమంత్రుఁడు—నీ వెక్కడికి వెళ్ళెదవు?

భరతుఁడు—

ఆ. ఉండెద లక్ష్మణప్రియుం డెందు, నందుల
కరుగువాఁడ నేను; నమ్మహాత్ముఁ
డుండకుండెనే నయోధ్య యయోధ్య కా | దె
వెం దతండు గలఁ డదే యయోధ్య.

[అందఱు నిష్క్రమించిరి]



ఇది తృతీయాంకము

# ప్రతిమా నాటకము

## చతుర్థాంకము

---

[అంతఁ జేటికలు ప్రవేశింతురు]

విజయ—ఓసీ! నందసికా! చెప్పూ - చెప్పూ. ఇప్పుడు కౌసల్యమ్మగారు మొదలుగా జనానా వారంతా ప్రతిమాగృహాము చూడబోతేగాదూ బాబులు భరతులుగా రక్కడ తారసిల్లినది? దురదృష్టవంతురాలిని నేనప్పుడు వాకిలి దగ్గిర ఉన్నాను.

నందిసిక—ఓసీ! మే మంతా ముచ్చటగా చూచినాము బాబులు భరతులుగారిని.

విజయ—కైకమ్మగారిని బాబులు ఏమన్నారే?

నందనిక—అనడమూ లేదు ఏమీ లేదు. బాబులు ఆవిడగారిని చూడడానికికూడా సమ్మతించలేదు.

విజయ—ఎబ్బే! ఎంతకష్టము. రాజ్యపాశ పెట్టుకొని బాబులు శ్రీరాములుగారికి పట్టము చెడగొట్టబోయి దానితో తనకు వైధవ్యము కూడా తెచ్చుకొన్నది; లోకానికీ కీడు తెచ్చినది. దయాదాక్షిణ్యాలు లే వామెగారికి; కసుమాలపు పని చేసింది.

నందనిక—ఓసీ! విను: ప్రకృతులు తెచ్చిన అభిషేకమును పారవిడిచి రామబాబు లున్న తపోవనానికే వెళ్ళినారు భరతబాబులు.

విజయ— (సవిషాదముగా) ఆఁ! బాబులు వెళ్ళిపోయినారా? నందనికా! రా! కైకమ్మగారిని చూదాము. (వెళ్ళిరి.)

[ఇది ప్రవేశకము]

[అంత భరతుఁడు రథముతో సుమంత్రుఁడును, సూతుఁడును వత్తురు.]

భరతుఁడు—

ఉ. చేరె దివంబు తేఁడు తన
చేసినపున్నెము వెన్నడింపఁగాఁ;

పౌరజనాళిబాష్పజల
పాతము లిత్తఱి వెన్నడింపఁగాఁ
జేరెద నేనునుం గృపణ
చేష్టలులేని తపోవనాళికిన్
ధారుణి రామనామమునఁ
దన్పెడు మాఱటచందురుఁ జూడఁగన్.

సుమంత్రుఁడు—ఈతఁడు ఈ యాయుష్మంతుఁడు! భరతుఁడు!

ఉ. పుత్త్రుఁడు దైత్యసర్మథన
పుణ్యయశుం డగునట్టి తేఁటికిన్
బౌత్త్రుఁడు సత్త్రిభోజిత స
మస్తధనుండగునట్టి తేనికిన్
బిత్రనువర్తి రామునకు
నెయ్యపుఁదమ్ముఁ డితండు, వహ్వా; స్తో
త్రాత్రము పేర్మికిం దగిన
పద్ధతినే చనుచున్నవాఁ డహో!

భరతుఁడు—ఓ నాయనా!

సుమంతుఁడు—బాబూ! ఇదిగో ఉన్నాను.

భరతుఁడు—పూజ్యుఁడు మాయన్న రామచంద్రమూర్తి యెక్కడ? ఆ మహారాజులుంగారి ప్రతినిధి యెక్కడ? సారవంతుల సన్నిదర్శనమెక్కడ? రాజ్యలుబ్ధ యగు కైకేయికిఁ బ్రత్యాదేశ మెక్కడ? సద్యశమునకు స్థానమెక్కడ? ఆ నృపకుమారుఁడెక్కడ? ఆసత్యసంరక్షకుఁడెక్కడ?

గీ. నాదుతల్లికిఁ బ్రియము నొనర్పఁ గోరి
రాచసిరిపెంపు నెవ్వఁడేఁ ద్రోచిపుచ్చె
నమ్మహాత్ముఁ డిక్ష్వాకువంశాభరణము రఘు.
నాదుదైవత మెచట నున్నాఁడొ చూడ!

సుమంత్రుఁడు—బాబూ! ఈ యాశ్రమపదమునఁ గలఁడు.

గీ. అందె రాముండు, సీత, మహాయశస్కుఁ
డయిన లక్ష్మణుఁడును గల రరసి కనుము
సత్యమును, శీలమును, భక్తి జగమునందు
విగ్రహము లందె నా వారు వెలయువారు.

భరతుఁడు—అట్లైన రథము నాఁపుము.

సూతుఁడు—బాబుల సెలవుప్రకారము.

భరతుఁడు—(రథమునుండి దిగి) సూత ! గుఱ్ఱములను విడిగా విశ్రమింపఁజేయుము.

సూతుఁడు—బాబుల సెలవుప్రకారము.

(వెడలును)

భరతుఁడు—ఓనాయన ! విన్నవింపుము ; విన్నవింపుము !

సుమం—కుమార ! ఏమని విన్నవింతును ?

భరతుఁడు—'రాజ్యలుబ్ధ యగు కైకేయికిఁ గొడుకు భరతుఁడు వచ్చె' నని.

సుమంత్రుఁడు—కుమార! ఉడుగుము. గురుజనాపవాదము నుగ్గడింపరాదు.

భరతుఁడు—మంచిది. పరదోషము నుగ్గడించుట న్యాయ్యముకాదు. కనుక నిట్లు చెప్పుఁడు. 'ఇక్ష్వాకుకులకళంకభూతుఁ డగు భరతుఁడు వచ్చె' నని.

సుమం—కుమార! నే నిట్లు చెప్పఁజాలను. మఱియేమన, "భరతుఁడు వచ్చె" నని చెప్పెదను.

భరతుఁడు—వలదు, వలదు. పేరుమాత్రము పేర్కొనుట నాకుఁ బ్రాయశ్చిత్తము జరగని తెఱఁగుగాఁ దోఁచుచున్నది. బ్రహ్మహత్యఁ జేసిన వాండ్రకుఁగూడఁ బరులచే నివేదము లేదు గదా! కనుక మీరు నిలుఁడు. నేనే విన్నవించుకొందును. ఓహో ఓయి! విన్నవింపుఁడు, విన్నవింపుఁడు, పూజ్యుఁడును, పితృవాక్యపాలకుఁడును నగు రామచంద్రమూర్తికి!

ఆ. జాలిలేనివాఁడు, మేలు మఱచువాఁడు,
పామరుండు, మోటుపనులవాఁడు
ఐన భక్తిమంతుఁ డరుదెంచె నొక్కండు Rep.
నిలువ నెలవొ ? లేక తొలఁగ నెలవొ ?

(అంత రాముఁడు సీతాలక్ష్మణులతోఁ బ్రవేశించును.)

రాముఁడు—(విని సహర్షముగా) సౌమిత్రీ! వింటివా ఓసి, విదేహరాజకుమారీ! నీవును వింటివా?

మ. ఊఱుముఁ బ్రమింగిన దీస్వరం బెవరిదో
కో యయ్యోడుఁ! మత్పిత్ర

సర్వమున్ బోలి వినంబడెఁ; మదికి నా
శ్వాసంబు, సౌహార్దముఁ
బరితోషంబును సంతరించె; మఱియుఁ
బంధుత్వసందేహముఁ
నెఱయించెన్; బెరయించె వీనుగవకుఁ
నెయ్యంబు తియ్యం బహో!

లక్ష్మ—ఆర్య! నాకును. నీపలుకుసవ్వడి బంధు జనబహుమానమును బుట్టించుచున్నది సుమా!

ఈ స్వరము—

ఉ. బింకము గల్గి, స్పష్ట మయి,
పెద్దది యై, కల మై, మహోక్షపుఁ
అంకెయుఁబోలె స్నిగ్ధమధు
రం బయి, కంఠమునం దురంబునఁ
జంకని దై, స్ఫుటాంగముల
స్థానము లంటినయక్షరంబులఁ
బొంకము గాంచి, వర్ణములఁ
బ్రోవఁగఁజాలినదో యనం దగెన్.

రాము—ఈపలుకుతీరు బాంధవునిదే యను టకు సందేహములేదు. నాహృదయమును గలఁచి

వైచుచున్నట్లున్నది. వత్స, లక్ష్మణా, చూడు మోయి!

లక్ష్మ—ఆర్యుని సెలవు ప్రకారము. (కదలును)

భరతుఁడు—అన్నా! ఏమి? ఎవరును బదులు పలుకకున్నారు? కైకేయీ పుత్రుఁ డగు భరతుఁడు వచ్చె నని తెలిసికొనరా యేమి?

లక్ష్మ—(చూచి) అరే! ఈయన! అన్న! రామచంద్రమూర్తి! కాదు, కాదు; అన్నపోలిక!

ఉ. అన్న మొగంబుఁబోలెఁ జెలు
వారు మొగంబు శశాంకహృద్య మై
పెన్నురముఁ సురారిశర
పీడిత మౌ నృపుజొమ్ముపోల్కి నొ
ప్పౌ న్నెఱకాంతిపుంజమునఁ
బొల్చు జగత్ప్రియ దర్శనుండుగా
ని న్నరనాథుఁ డౌరయ మ
హేంద్రుఁడొకో, మధుసూదనుండొకో!

(సుమంత్రుని జూచి) ఓహో! నాయన!

సుమం—ఓహో! బాబు లక్ష్మణుఁడు!

భరతుఁడు—అగును! ఈయన, అన్నగారు! అన్నా! మ్రొక్కుచున్నాను.

లక్ష్మణుఁడు—రమ్మ, రమ్మ చిరంజీవ! (సుమంత్రునిఁ జూచి) నాయనా! ఈయనయెవరు?

సుమంత్రుఁడు—కుమార!

గీ. రఘునకుఁ జతుర్థుఁ డజున కరయఁ దృతీయుఁ
డీకఁ బ్రతీతుఁడౌ మీదుతండ్రికి ద్వితీయుఁ
డన్వయోద్దీపకునకు నీయన్న కీవు
వలె ననుజుఁడు చిరంజీవి భరతుఁ డితఁడు.

లక్ష్మ— ఇక్ష్వాకుకుమార! రా! రమ్మ వత్సా! స్వస్తి: ఆయుష్మంతుఁడ వగుము.

శా. స్పష్టానేకమహాహవాళి నసుర
వ్రాతమ్ములన్ వజ్రసం
ఘృష్టప్రౌఢశరంబులం దునిమి కీ
ర్తిం గన్న ప్రాగ్భూపులన్
యష్టన్ యజ్ఞవితీర్ణ వైభవు రఘున్
శౌర్యాదులన్ బోలుచున్
బుష్టోత్కృష్టగుణ ప్రతానఖని వై
పొల్పొందు మూర్జస్థలిన్.

భర—అనుగృహీతుఁడను.

లక్ష్మ—తమ్ముఁడా! ఇక్కడ నుండుము. నీ రాక నార్యునకు విన్న వింతును.

భర—అన్నా! అభివాదనము చేయుటకు నామన స్త్వరపడుచున్నది. శీఘ్రముగా నివేదింపుము.

లక్ష్మ—మంచిది. (చేరఁబోయి) ఆర్యునకు జయము. ఆర్యా!

ఆ. నీకు నెంతయేని నెయ్యంపుఁదమ్ముండు
భరతుఁ డితఁడు భ్రాతృవత్సలుండు
అద్దమందుఁబోలె నగపడె నీచాయ
చక్క నితనియందు సంక్రమించి.

రాము—వత్స! లక్ష్మణ! ఏమిది! భరతుఁడు వచ్చెనా?

లక్ష్మ—ఆర్య! అవును.

రాము—మైథిలీ! భరతునిఁ జూచుకొఱకు నీ కనుదోయి నాయతపఱుచుకొనుము.

సీత—ఆర్యపుత్త్ర! భరతుఁడు వచ్చినాఁడా?

రాము—మైథిలి ! అవును

గీ. ఎఱుఁగుచున్నాఁడ నిప్పుడే యేను జలుప
నలవి గానిది నాతంండ్రి సలిపె ననుచు;
తమ్ముఁపయికూర్మి యిట్టివిధమున నుండె
కన్నకడుపుపై కూర్మి యెక్కరణి దగునో ?

లక్ష్మణుఁడు—ఆర్య ! తమ్మునిఁదోడ్కొని
రమ్మని సెలవా ?

రాముఁడు—వత్స ! లక్ష్మణ ! ఇందుఁగూడ
నా యభిప్రాయము ననువర్తింప నడుగుచు
న్నావా ? అరుగుము. సత్కరించి శీఘ్రముగా
దమ్ముని దోడ్కొనిరమ్ము.

లక్ష్మణుఁడు—ఆర్యుని సెలవుప్రకారము.

రాముఁడు—లేక నీవు నిలుము.

మ. ఇవతాళించిన కల్వతేకు లనఁగా
సింపారుకన్దోయి హ
ర్ష విశేషమ్మునఁ బుట్టు బాష్పజల మా
సారంబుగా జాఱ గా

రవముం జూపఁగఁ దానె యియ్యవిద చే
రంబోవుఁగా కాత్మజుం
దివుటల్ దీఱఁగఁ దారసిల్లుజననీ
స్నేహంబుఁ దోఁపించుచున్.

సీత—ఆర్యపుత్త్రి లాన తిచ్చినట్లే. (లేచి పరిక్రమించి భరతునిఁ జూచి) నేను లేచి చూచే యింతలో ఆర్యపుత్త్రిలు ఇక్కడకి వచ్చినారే! కాదు కాదు. రూపుచాలిక !

సుమంత్రుఁడు—ఓహో ! కోడలు !

భరతుఁడు—ఓహో ! ఈమె పూజ్యురాలు జనక రాజపుత్రి !

గీ. నేల దున్నుచో నాఁగంటిచాలువలన
నవతరించిన స్త్రీమయ మయిన తేజ
మిది జనకభూమివిభుని యహీనపుణ్య
తపమునకు మఱియును సన్నిదర్శనంబు.

అమ్మా ! అభివాదించుచున్నాఁడను. నేను భరతుఁడను.

సీత—(తనలో) రూపమే కాదు; పలుకు తీరుగూడా నదియే! (ప్రకాశముగా) దీర్ఘాయుష్మంతుడవుగా నాయనా!

భరతుఁడు—అనుగృహీతుఁడను.

సీత—రా! నాయనా! అన్నగారి ముచ్చట తీర్తువు.

సుమంత్రుఁడు—బాబూ! ప్రవేశింపుము.

భరతుఁడు—తండ్రీ! నీ విప్పు డేమి చేయుదువు?

సుమంత్రుఁడు—

గీ. అవనినాథుండు దివమున కరిగినపయి
దుఃఖితుం డైన రామచంద్రునకు నాకుఁ
జొప్పడియె నిప్పటికిఁ దొలిచూపు గాన
యవల నే వత్తు ముందు నీ వరుగుమన్న!

భరతుఁడు—అట్లే సరి. (రామునిఁ జేరఁబోయి) అన్నా! అభివాదనము చేయుచున్నాఁడను—నేను భరతుఁడను.

రాముఁడు—(సహర్షముగా) రారమ్ము, ఇక్ష్వాకుకుమారా! స్వస్తి. ఆయుష్మంతుఁడ వగుము.

ఉ. డగ్గఱ కేఁగుదేరుమ! వె
డందకవాటముతీరుపేరురం
బాగ్గుమ; నీ సుదీర్ఘభుజ
యుగ్మమునన్ నను నిండుఁగౌఁగిటన్
డిగ్గ గ్రహింపుమా; వెలయు
నెమ్మొగ మెత్తుమ; శోకవహ్నిచే
బొగ్గులువాఱియున్న తను
వున్ దనియింపుమ; రమ్మ, తమ్ముఁడా!

భరతుఁడు—అనుగృహీతుఁడను.

సుమంత్రుఁడు—(చేరఁబోయి) ఆయుష్మంతు
నకు జయము.

రాముఁడు—హా! నాయనా!

సీ. మున్ను సురాసురుల్ మిన్నంటిచండప్ర
చండ సంగ్రామముల్ సలుపునపుడు
సేనతో దేవసమానవిమానము
లెక్కి విక్రమ కేళి నేపుసూప
నచ్చెరువంది సురాసుర 'లాతఁడే
యాతఁడే దశరథు' డనుచుఁ బొగడ

నెగడిన శ్రీమంతుఁడగు నమ్మహారాజు
నెయ్యంపుమిత్రుని నిన్ను, నాత్మ
దేహమును ద్యజించి దేవలోకమ్మున
నాత్మవంశ్యు లయిన యవనిపతులఁ
బితరులను ముదమున జతకూడి యిత్తఱి
నందుచున్న వాఁడె యాత్మసుఖము?

సుమంత్రుఁడు—(దుఃఖముతో)

మ. పరలోకంబున కేఁగె భూవిభుఁడు నీ
వా యీవనుల్ సేరి తీ
భరతుండా కడుఁ గుంది వోందెఁ గులమా
హాత్మ్యంబు నిన్ ...

కల్గెరణీ బెకుల్ సంకటంబులకు నో
గంజేయుచుణ్ నన్ను నీ
చిరజీవత్వము మేలువోలె నిసిరో
చెందించె బెన్ దోషముల్!

సీత—అసలే పొగులుతూన్న ఆర్యపుత్త్రి
లను నాయనగారిమాటలు మరింత పొగిలిస్తున్నవి.

రాముఁడు—మైథిలీ! ఇదిగో నిబ్బరించుకొంను
చున్నాను. వత్స! లక్ష్మణ! ఉదకమోయి !

లక్ష్మణుఁడు—ఆర్యుని సెలవు ప్రకారము.

భరతుఁడు—ఆర్య! న్యాయ్యము కాదుగదా! క్రమముతీరున శుశ్రూషింతును. నేనే యుదకము తెత్తును. (కలశమును గైకొని నిష్క్రమించి ప్రవేశించి) ఇదిగో ఉదకము.

రాముఁడు—(ఆచమించి) మైథిలీ! లక్ష్మణుని శుశ్రూష సడలుచున్నదిగదా!

సీత—ఆర్యపుత్త్ర! ఈయన సేవకూడా మీరు పొందవలసినవారేకదా!

రాముఁడు—లక్ష్మణుఁ డిక్కడనుండి శుశ్రూషించును గాక! భరతుఁడు పురమునుండి నన్ను శుశ్రూషించునుగాక! ఇది లెస్సగదా!

భరతుఁడు—ఆర్యుఁడు నన్ను ననుగ్రహింపవలెను.

గీ. మేనిచే నిచ్చటనె నన్ను మెలఁగనిందు
   కర్జములచేత నచ్చటఁ గలుగఁగలను
   అన్న! నీపేరిచేతనే యఖిలరాజ్య
   పాలనమ్ము నిర్వక్రమై పరఁగఁగలదు.

రాముఁడు—వత్స! కైకేయీతనయ!
దట్లు వలదు.

ఉ. నమ్మ వనమ్ముఁ జేరుటకు
నాయనయానతిచుమ్ము హేతు వో
తమ్ముఁడ! భీతి గాదు మఱి
దర్పము గాదు మతిభ్రమంబు గా
దెమ్మెయి సత్యమార్గ గతి
యే చుమి సంపద యస్మదీయవం
శమ్మున; కేటి కిట్లు మఱి
సల్పెద వల్పపుంద్రోవఁ బోవఁగన్?

సుమంత్రుడు—ఇప్పు డీఁక నభిషేకో
మెక్కడ నుండవలెను?

రాముఁడు—మాయమ్మగా రెక్కడ ను
వలె నని చెప్పిరో యక్కడనే యుండవలెను.

భరతుఁడు—అనుగ్రహింప వేఁడెద. ఆర్య
పుంటిపైఁ బొడువవలదు.

ఉత్సాహ.

నన్ను తాత్మక! నీవ్రిసూతియొ
చక్క నాకుఁ బ్రిసూతి యౌ

నన్న ! నిన్నును గన్నయన్నభృ
 తాత్ముఁడే ననుఁ గన్నవాఁ
డెన్నరానిది మాతృదోషము
 చేసియుం బురుషాళికిన్
మున్నవోలెఁ గనుంగొనంగదె
 ద్రొక్కెడన్ భరతున్ ననున్.

సీత—ఆర్యపుత్త్ర! భరతుఁడు కడుజాలిగా డుగుకొంటున్నాడు. మీరేమి యోచిస్తున్నారు?

రాము—మైథిలీ !

౫. తలఁపునఁ బాఱెడిన్ ద్రిదివ
 ధాముఁడు భూమివిభుండు, పుత్త్రిలన్
దుల యిడరాని సద్గుణము
 నోహరు సీతనుఁ జూచి మెచ్చుకోఁ
గలుగకపోయె: సట్టిగుణ
 గణ్యునిఁ బుత్త్రినిఁ గన్న పుణ్యవం
తులపయినైతముం జెడుగు
 తుట్టలు చుట్టును దైవ మయ్యయో !

నాయనా ! భరతా !

మ. పరితోషించితి నీయెడన్, నిజము, కా
పట్యమ్ము నీయందు లే,
దరుదెంతున్ భవదీయయోగ్యతకు లో
నైనాఁడ, నట్లయ్యు, భూ
వరుప లీఁక విటు తప్పఁ ద్రోవఁ దగ దో
వత్సా ! భవత్సన్నిభున్
వరపుత్త్రిన్ గనుఁగొన్న తండ్రినుడియున్
వ్యర్థంబు గావచ్చునే ?

భరతుఁడు—

ఉ. అంతము నెందు నెప్పటికి
నన్న ! భవచ్ఛపథంబు ? త్వత్పద
ప్రాంతమునందు నుందు నిట
నప్పటిదాఁకను—

రాముఁడు—

కాదు కాదు, భూ
కాంతుఁడు సత్యవాక్సుకృత
గౌరవ మందునుగాక ; నీవు నీ

సొంతపురాజ్య మేలుకొనఁ
జూడవయే సిదె యొట్టు వెట్టెదన్.

భరతుఁడు—అన్నా ? మాటాడరాకుండ మాటాడితిరి ! కాని ఒకకట్టుఁబాటున కొప్పెదరేని మీ రాజ్యమును బాలింతును.

రాముఁడు—వత్స ! ఆకట్టుఁబా టెట్టిది ?

భరతుఁడు—నాచేత నుంపఁబడిన మీ రాజ్యమును బదునాల్గువత్సరములు గడచిన పిదప మరలఁ బుచ్చుకొనఁగోరుచున్నాఁడను.

రాముఁడు—అట్లే కానిమ్ము.

భరతుఁడు—ఆర్య ! వింటివా? అమ్మా! వింటివా ? నాయనా! వింటివా ?

అందఱు—మే మెల్లరమును వింటిమి.

భరతుఁడు—ఆర్య ! మఱియొక వరమును గూడఁ గోరుచున్నాఁడను.

రాముఁడు—ఏమి కోరెదవు? నే నేమేని యొసఁగవలెనా ? నే నేమేని యనుష్ఠింపవలెనా ?

భరతుఁడు—

గీ. అన్న! నీ పాదపద్మము లనుభవించు
పాదుకల నిమ్ము తలతోడఁ బ్రణతు లివిగొ
మరల నీవచ్చునందాఁకఁ బురిని వీని
కిని విధేయుఁడ నై నేను బను లొనర్తు

రాముఁడు—(స్వగతము) ఆహాహా!

క. ఇంచుకమాత్రయశం బా
ర్జించితి నే నింతవఱ సుచిరకాలమునఁ;
గొంచెపుఁగాలముననె యా
ర్జించెఁ భరతుండు జగతి స్థిరతరయశముఁ!

సీత—ఆర్యపుత్రా! భరతుఁడు కోరిన తొలి
కోరిక ఇత్తురుగదా!

రాముఁడు—అట్లే యగుఁగాక! వత్స! కై
కొనుము.

భరతుఁడు—అనుగృహీతుఁడను. (గ్రహించి)
ఆర్య! అభిషేకోదకము నీపాదుకలపై నుంపఁ
గోరుచున్నాఁడను.

రాము—(సుమంత్రునితో) నాయనా! భరతున కేది యిష్టమో అది యెల్ల జరపంగోరుచున్నాడను.

సుమంత్రుఁడు—చిరంజీవి సెలవుప్రకారము.

భరతుఁడు— (ఆత్మగతము) అమ్మయ్యా! ఇప్పటికిఁగదా!

ఉ. పౌరుల కిష్టుఁడన్ స్వజన
వత్సలుఁడన్ భువనప్రియుండ భూ
మీరమణుండు స్వరతుఁడు
మెచ్చు సుశీలపుబిడ్డఁడన్ గుణో
దారులకున్ సహోదరుల
కాదరణీయుఁడ! బుణ్యకీర్తివి
స్తారుఁడ సజ్జనావళిప్ర
శంసకు నర్హుఁడ లబ్ధకాముఁడన్.

రాము—వత్స! కైకేయీతనయ! రాజ్యమెట్టి దనఁగా, క్షణముగూడ ఏమఱి యుండఁదగనిది. కనుక, నీవు విజయముకై వెంటనే తిరిగి వెడలవలెను.

సీత — ఆఁ! ఆఁ! భరతుఁ డిప్పుడే బయల్దేరి వెళ్ళునా ?

రాముఁడు — అతిస్నేహము వలదు. చిరంజీవి యిప్పుడే విజయమునకై బయలువెడలుఁగాక!

భరతుఁడు — ఆర్య! ఇప్పుడే వెడలుదును.

గీ. గంపెఁ డాసతోఁ బౌరులు గాచియుంది
రన్న! నిన్నుం గనుంగొన నయ్యయోధ్య
నే నిదే వేగ కొనిపోయి నీప్రసాద
మచటఁ గాన్పించి వారి నూరార్చువాఁడ!

సుమం — చిరంజీవీ! నే నిప్పు డేమి చేయవలెను ?

రాముఁడు — నాయనా! మహారాజులుంగారి వలె నీ చిరంజీవిని గాపాడవలెను.

సుమం — బ్రతికియుంటినా యట్లే యత్నింతును.

రాముఁడు — వత్స! కైకేయీ తనయ! నాముందే రథము నధిరోహింపుము.

భర—ఆర్యుని సెలవుప్రకారము.

(రథ మధిరోహింతురు.)

రాముఁడు—మైథిలీ! ఇటు రా! వత్స, లక్ష్మణ! ఇటు రా! ఆశ్రమద్వారమువఱకైనను భరతుని సాగనంపుదము.

[అందఱు నిష్క్రమించిరి)

ఇది చతుర్థాంకము

---

# ప్రతిమా నాటకము

## పంచమాంకము

---

[అంత సీతయూ, తాపసియుఁ బ్రవేశింతురు]

సీత—అమ్మయ్యా! పూజకై తెచ్చినపూవు లంతటా రాలి ఉండగా ఆశ్రమమును చక్కఁగా ఊడ్చినాను. ఆశ్రమపు ఉసికికి అనువయ్యేటంతలో, దేవపూజ యేర్పాట్లు చేసినాను. ఆర్యపుత్రులు ఇంకా రాలేదు. వచ్చేలోగా నేనీ గున్న చెట్లను నీళ్ళు పోసి సంతోషపడుస్తాను.

తాపసి—అవిఘ్నముగా కానీ అమ్మా!

(పిదప రాముఁడు ప్రవేశించును)

రాముఁడు—సశోకముగా)

ఉ. నాయన, నేను లేనికత

నడమతి గొల్పకయోధ్య వీడి నా

కై యభిషేకయత్నమున
    నక్కట యిక్కడి కేఁగుదెంచె ని
ర్మాయుఁడు, తోడనే మహిభ
    రంబు భరింపఁగఁ బంపినాఁడ, నా
హా! యతఁ డొక్కఁడే నృపమ
    హాభరముఙ్ దల మోచుచుండునే!

(విమర్శించి) ఇటువంటిదే యిది! ఇఁక నే నిప్పుడిట్టి దుఃఖమును దొలఁగించుకొనుటకయి, అవస్థాకుటుంబిని యయిన మైథిలిని జూతును. కాని మైథిలి యెక్కడికో యేఁగినదే! (పరిక్రమించి చూచి) ఓహో! ఓహో!

సీ. ఆలవాలముల నిండార నుర్వులువాఱి
    వారిపూరము పాఱువాఱుచుండె
దగఁగొన్న ఖగములి త్తరుల చెంతలనుండి
    యరుదెంచి బురుదు నీ రానకుండె
బిలములందు జలమ్ము నెలకొన్నఁ గీటంబు
    లంతంత మొరకల కరుగుచుండె
తరుమూలములనీరు తటుఁగుచున్న కొలంది
    వలయముల్ క్రొంగ్రొత్త వెలయుచుండె

తీయనీ రిప్పుడిప్పుడే పోయుచున్న
పగిదిఁ గనుపట్టు నీ చెట్టుపాదు లింత
లంతలం బాొంతములజనకాత్మజాత
చెలఁగుచుండె నటంచు సూచించుచుండె.

(విలోకించి) ఓహో! ఇదిగో వైదేహి! అయ్యో! అవస్థ!

మ. కనుగందు౯ ముకురంబునం దయిన ని
కర్ణంజాక్షి కెంగేలు ము౯
వసివాళ్వాడదుచూవె వారిఘటము౯
దాల్పంగనే సిందు నేఁ
డిసిరో మవ్వపుఁబూవుఁదీవియల క
ట్లే బోట్లకుంగూడఁ గ్ర
కర్ణసపాటుం గలిగించునోటు! కలయం
గాంతారపుం బొంతముల్!

(చేరఁబోయి) మైథిలీ! తపసు వర్ధిల్లుచున్నదా?

సీత___ఓహో! ఆర్యపుత్త్రులు! ఆర్యపుత్త్రులకు జయము!

రాము — మైథిలి! నీ ధర్మకార్యమునకు విఘ్నము లేదేని కూర్చుండుము.

సీత — ఆర్యపుత్త్రుల సెలవు ప్రకారము. (కూర్చుండును.)

రాము — మైథిలీ! దేనినో అడుగ నభిలషించుచున్నట్టుంటివి. ఏ మది?

సీత — శోకముచేత వ్యాకులచిత్తులుగా ఉన్నట్టున్నారు మీరు; ముఖముతీరు చూడఁగా కంది ఉన్నది. ఏమి టిది?

రాము — మైథిలీ! వ్యాకులత కిది అవసరమే కదా?

గీ. హృదయ మదరంట జముఁ జేసె గుదియ వ్రేటు
నాఁ డదాపుండు నేఁటికి నట్టె యుండె Rely
దానిపై మాటిమాటికిఁ దాఁకుచుండెఁ
బలుప్రయోజనముల శోకబాణహతులు.

సీత — ఆర్యపుత్త్రుల కిప్పుడు సంతాప మెందుకు కలుగవలెను?

రాము—తేపు నాయనగారి యనుసంవత్సర శ్రాద్ధవిధి. కల్పవిశేషముచేతఁ బితరులు పిండప్రదానము నపేక్షింతురు. కావున తేపు దీని నే నెట్లు నిర్వర్తింపఁ గల్గుదునా యని చింతించుచున్నాఁడను. లేకున్నను,

గీ. అందుదురు తృప్తి వా రెట్టులైనఁ గాని
నా దశను వా రెఱింగియున్నార కాదె;
ఐన యత్నించుచుంట నాయనకు, నాకు
నర్హ మగురీతినే పూజ నాచరింప!

సీత—ఆర్యపుత్త్ర! భరతుఁ డక్కడ విభవముతో శ్రాద్ధము జరుపును. స్థితిగతులకు తగినట్లు మీ రిక్కడ ఫలోదకములతో జరుపుదురు గాని. ఇదీ నాయనగారికి మిక్కిలి ప్రియమే అవుతుంది.

రాముఁడు—మైథిలీ!

క. ఫలములు దర్భలపైఁ జే
తులలో నే నిడుటఁ జూచి తోడనె నేఁ గా

నల నుండుటఁ దలపోయును
విలపించుఁ; దీనఁగూడ వెత నాయనకుఁ.

(అంతఁ బరివ్రాజక వేషముతో రావణుఁడు ప్రవేశించును)

రావ__ఔరా! ఈ నేను!

ఉ. తేరకు ముఁ ఖరాసురు న
ధించి విరోధము తెచ్చికొన్న దు
ర్వీరుని రామునిఁ గపట
వేషమునఁ జని కాంచి వంచనఁ
దారిచి తప్పఁద్రోచి సుప
దస్వరసంస్కృతిశూన్య యా హవి
ర్ధారనుబోలె జానకి న
దాటున నే హరియింప నేఁగెదఁ.

(పరిక్రమించి చూచి) ఇది రామునియాశ్రమస్థాన మునకు ద్వారము. ఇఁక దిగుదును. (దిగును.) ఇదిగో నేను నతిథిమర్యాద ననుష్ఠింతును. నేను అతిథిని. ఎవ రక్కడ?

రాము__(విని) అతిథికి స్వాగతము!

రావణు—స్వాభావికమగు రూపసౌందర్యము స్వరసౌభాగ్యముచే నిబ్బిడి యయ్యెఁగదా!

రాము—(చూచి) ఓహో! స్వాములవారు! స్వామీ! అభివాదనము చేయుచున్నాఁడను.

రావణుఁడు—స్వస్తి.

రాము—స్వామీ! ఈ యాసనముపై నాసీనుల రగుఁడు.

రావ—(ఆత్మగతము) ఏమి! ఈతఁడు సన్నానవెట్టున ట్టున్నాఁడు (ప్రకాశము) లెస్స. (కూర్చుండును.)

రాము—మైథిలీ! స్వాములవారికి పాద్యము గొనితెమ్ము!

సీత—ఆర్యపుత్త్రుల సెలవుప్రకారము. (వెళ్లి వచ్చి) ఇదిగో ఉదకము.

రాము—స్వాములవారిని శుశ్రూషింపుము.

సీత—ఆర్యపుత్త్రుల సెలవుప్రకారము.

రావణు——(మాయాప్రకాశనపర్యాకులుఁడై) ఉండనీ, ఉండనీ.

ఆ. పుణ్యసాధ్వి యీమె భూమి నరుంధతీ
కాంతచూవె మర్త్యకాంతలందు
ఈమెభర్త వంచు నెల్ల పతివ్రతల్
మెచ్చుచుంద్రు నిన్ను హెచ్చుగాను.

రాము——అట్లని యిటు తెమ్ము. నేనే శుశ్రూషింతును.

రావ——అయ్యా! నీడను దప్పుకొన్న వాఁడను, శరీరము నే లంఘింప నంగీకరింతునా? మాటమంచి తనమున నే యతిథిసత్కారము గలదుగదా! సత్కారము జరగెను. ఆసీనుఁడ వగుము.

రాము——లెస్స. (కూర్చుండును.)

రావణు——(ఆత్మగతము) నేనున్ను బ్రాహ్మణ సముదాచారము ననుష్ఠింతును. (ప్రకాశము) నే నయ్యా! కాశ్యపగోత్రుఁడను. సాంగోపాంగముగా వేదము నధ్యయనము చేసితిని. మానవీయ మగు

ధర్మశాస్త్రమును, మాహేశ్వరమగు యోగశాస్త్రమును, బార్హస్పత్యమగు నర్థశాస్త్రమును; మేధాతిథిన్యాయశాస్త్రమును, ప్రాచేతసశ్రాద్ధకల్పమునుగూడ నధ్యయనము చేసితిని.

రాము—ఏమీ యేమీ! శ్రాద్ధకల్పమునుగూడ నధ్యయనము చేసితిరా ?

రావ—సర్వశ్రుతులను విడిచి శ్రాద్ధకల్పముమీఁద నాస్థ చూపుట యిది యేమి ?

రాము—స్వామీ! (జీవత్పితృకతాభాగ్యము చెడుటచే నది యపేక్షింపవలసెను.)

రావ—దాని నడుగ నభ్యంతరపఱుచుట కాదు. అడుగవచ్చును. అడుగుము.

రాము—స్వామీ! పిండప్రదానకాలమందుఁ బితరులను దేనిచేఁ దృప్తిపఱుపఁగల్గుదును ?

రావణు—శ్రద్ధతో దేని నొసఁగినను శ్రాద్ధమగును.

ధర్మశాస్త్రమును, మాహేశ్వరమగు యోగశాస్త్రమును, బార్హస్పత్యమగు నర్థశాస్త్రమును; మేధాతిథిన్యాయశాస్త్రమును, ప్రాచేతసశ్రాద్ధకల్పమునుగూడ నధ్యయనము చేసితిని.

రాము—ఏమీ యేమీ! శ్రాద్ధకల్పమును గూడ నధ్యయనము చేసితిరా ?

రావ—సర్వశ్రుతులను విడిచి శ్రాద్ధకల్పము మీఁద నాస్థ చూపుట యిది యేమి ?

రాము—స్వామీ! (జీవత్పితృకతాభాగ్యము చెడుటచే నది యుపేక్షింపవలసెను.)

రావ—దాని నడుగ నభ్యంతరపఱచుట కాదు. అడుగవచ్చును. అడుగుము.

రాము—స్వామీ! పిండప్రదానకాలమందుఁ బితరులను దేనిచేఁ దృప్తిపఱుపఁగల్గుదును ?

రావణు—శ్రద్ధతో దేని నొసఁగినను శ్రాద్ధ మగును.

రాము—హిమవంతముమీఁదనా ? ఏవీ ! చెప్పుఁడు !

రావణు—హిమాలయపు సప్తమశిఖరముమీఁద సాక్షాత్పరమశివుని శిరస్సుననుండి క్రిందికిఁబడుచుండు గంగోదకములఁ ద్రావునవి, వైడూర్యశ్యామపృష్ఠములు, పవనసమజవములు, కాంచనపార్శ్వము లను మృగములు గలవు. వైఖానస వాలఖిల్య నైమిశీయాదు లగు మహర్షులు తలఁచినంతమాత్రముననే యవి యరుదెంచి యాపన్నము లగుచుండును. వానిచే వారు చేయు శ్రాద్ధకర్మములు చక్కఁగా సాఁగుచుండును.

ఉ. పుత్త్రిఫలంబుఁ బొందుదురు,
పొల్తురు సిద్ధరులై, సముజ్జ్వలద్
గాత్రములన్ విమానగతి
గాంతురు వేల్పులతో, మఱెప్డుఁ దా
పత్రయచింతలం బడరు,
పాయక కాంతురు సార్వకాల మా
ముత్రికసౌఖ్య, మమ్మృగము
మూలమునన్ బరితృప్తు లౌ పితల్.

రాము—మైథిలీ !

చ. కొమరులమాడ్కి నీకుఁ గడుఁ
గూర్చెడు జింకలతోడ, నెయ్యపుం
ద్రుమములతోడ, వింధ్యవసి
తోఁ, జెలికత్తియ లాలతాళితో
హిమగిరి కాననంబుల స
మిద్ధమహౌషధిదీపితంబులం
దమర వసింప నేఁగుదు మ
టంచు వచించి యనుజ్ఞఁ బొందుమా !

సీత—ఆర్యపుత్త్రిల సెలవుప్రకారము.

రావణుఁడు—కౌసల్యాతనయ ! అంతగా బులుపాటము పెట్టుకోవలదు. అవి మనుష్యులకు గానరావు.

రాముఁడు—స్వామీ! హిమవంతమునందుఁ గదా అవి యుండును ?

రావణుఁడు—ఔను.

రాము—అట్లైన స్వాములు చూచుచుం డురుగాక !

క. మంచుంగుబ్బలితేఁ డల
కాంచనమృగములను నాకుఁ గన్పటుపవలెఁ
జంచన్మచ్చరనిహాతిఁ
గ్రౌంచాచలసామ్య మేసిఁ గాంచంగవలెన్.

రావ—(ఆత్మగతము) అహో! అసహ్యము గదా వీనియవలేపము! (ప్రకాశము) అన్నా! మెఱపులు రాలుచున్నట్టున్నవి. కౌసల్యాతనయ! ఇక్కడనే యున్ననుగూడ నిన్ను హిమవంతుఁ డారాధించుచున్నాఁడు. ఇదే! కాంచనపార్శ్వమృగము!

రాము—స్వాములవారి యనుగ్రహ మిది.

సీత—ఆర్యపుత్త్రిల అదృష్టము!

రాము—కాదు. కాదు.

గీ. అహహ నాయనగారిభాగ్యముచుమి యిది!
తానె యమ్మృగ మిచటికిఁ దరలివచ్చె
పూజ కియ్యది తగియుండెఁ; బోయి నీవు
మైథిలీ! లక్ష్మణునకు నీమాట తెలుపు.

సీత—ఆర్యపుత్త్రా! తీర్థయాత్రనుంచి తిరిగి వస్తూఉన్న మునికులపతిని యెదురుకోవలసిన దని సౌమిత్రికి ఆనతిచ్చితిరిగదా!

రాము—అట్లైన, నేనే వెళ్లుదును.

సీత—ఆర్యపుత్త్రా! నే నేమి చేయవలెను?

రాము—స్వామిని సేవింపుము.

సీత—ఆర్యపుత్త్రుని సెలవుప్రకారము.

(రాముఁడు నిష్క్రమించును)

రావ—అన్నా! ఇదిగో అర్ఘ్యమును గైకొని రాఘవుఁడు వచ్చుచున్నాఁడు. ఇదిగో ఇప్పుడు పర్విడుచున్న మృగమునుజూచి రాఘవుఁ డర్ఘ్యము నట్టె యుంచి ధనురారోపణము చేయుచున్నాఁడు.

గీ. అద్దిరద్దిర! బలము? వీర్యంబు వహావ!
చాఁగురే! సత్త్వ మయ్యారెజనము! చూడ
రామవరనామచిహ్నక్షురద్వయమున
నఖిలజగమును బర్యాప్త మగును దగును.

ఇదె మృగము ఒక్కదాటులో శరవిషయము నతిక్రమించి జీబుటడవిలోఁ జేరినది.

సీత—(ఆత్మగతము) ఆర్యపుత్త్రుని బాసి ఒంటరిగా ఉండడం నాకిక్కడ దిగులుదిగులుగా ఉన్నది.

రావణుఁడు—(ఆత్మగతము)

గీ. పాయఁ జేసితి రాముని మాయఁ జేసి
కూఁత లిడుదాని, బాల, నాకార్తి, సీత
నాగి సమంత్రోక్తమైన యాహుతినివలెఁ ద
పోవనమ్మునుండి కొంపోవువాఁడ.

సీత—పర్ణశాలలోనికి పోతాను.

(పోఁజూచును)

రావ—(స్వరూపము దాల్చి) సీతా! నిలు; నిలు.

సీత—(భయముతో) అయ్యో! ఎవ డిప్పుడు వీఁడు?

రావణుఁడు—ఏమి తెలియఁగవా?

చ. కణఁగి మహేంద్రుఁ దొట్టి సుర
కాండము గం డడఁగించినట్టి రా
వణుఁడను నేను, శూర్పణఖ
వంచనముం ఖరదూషణాదిమా
రణమును, గంటి వింటి సుదు
రాత్మ మహాబలు, రాము వంచనన్
మఱఁగఁగఁగొట్టి నిన్ను సుకు
మారి! యిదే హరియింప వచ్చితిన్.

సీత—అయ్యో! రావణుఁడా నువ్వు!

(వెల్వడును)

రావణుఁడు—అస్సే! రావణునికంటె కగపడి నీ వింక నెక్కడికిఁ బోఁగలవు?

సీత—ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి!! సౌమిత్రీ! కాపాడు! కాపాడు!

రావ—సీతా! నాపరాక్రమమును వినుము!

మ. పురుహూతుం బరిభూతుఁ జేసితిని దాఁ
పుల్ దాఁచితిన్ బ్రహ్మఁ గి

న్నరనాథుం బరిబాధితుం జలిపితిఁ
దండించితిన్ దండి ని
వ్వాఅపాలై దురపిల్లువేల్పులకు సం
వేశం బిసీ ! స్వర్గ ! మ
య్యారె భూలోకము ధన్య మయ్యెఁగదె సీ
తా ! నీవు వర్తిల్లుటన్.

సీత—ఆర్యపుత్రా ! కాపాడండి ! కాపాడండి ! సౌమిత్రీ ! కాపాడు ! కాపాడు ! నన్ను !

రావణుఁడు—

గీ. శరణు వేఁడుము రాము, లక్ష్మణుని శరణు
వేఁడు దశరథునేనియు వేఁడు శరణు
అల్పమనుజులు న న్నేమి సల్పఁగలరు?
కోల్పులిని జింకపిల్ల లదల్పఁగలవె ?

సీత—ఆర్యపుత్రా ! కాపాడండి ! కాపాడండి ! సౌమిత్రీ ! కాపాడు ! కాపాడు !

రావ—

ఉ. ఏడిచె దేల ! బేల ? కను
మీ ! నను మీనవిలోలనేత్ర ! నీ

వేఁడెదు నార్యపుత్త్రినటు
వేడుక సేయుమి నన్నుఁగూడఁ, బో
రాడఁగ నేఁగ నేఁగఁదేరఁగలఁ
డా యిఁక రాముఁడు సేన లెన్ని వెం
టాడిననేని, వేల్పులు స
హాయులుగా నరుదెంచిరేనియున్.

సీత—(రోషముగా) శపిస్తున్నాను!

రావ—హాహాహా! అబ్బో! పతివ్రతా తేజము!

గీ. ఆకసమ్మున నేను దూకాడునపుడు
సూర్యరశ్మిలుగూడ నన్ జూడలేవు!
ఈమె శపియింతు నన్న యీ యింతపల్కు
తాఁకుచే నాదుమే నెల్ల దగ్ధ మయ్యె.

సీత—ఆర్యపుత్త్రా! కాపాడండి! కాపాడండి!

రావ—(సీతను బట్టుకొని) ఓహో! జనస్థాన వాసులారా! తపస్వులారా! వినుఁడు, మీరు వినుఁడు!

ఆ. దశముఖుండు భూమితనయ నిదే! బలా
త్కారమున హరించి తరలుచుండె
క్షాత్రధర్మమందు సామర్థ్య మున్నం బ
రాక్రమించుగాఁక రాముఁ డింక!

సీత—ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి!

రావ—(పరిక్రమించుచు, చూచి) అన్నా! స్వపక్షపవనోత్ క్షేపముచే నరణ్యములెల్ల క్షుభిత పఱుచుచు, చండచంచువగు జటాయు విదె న న్నెదుర్కొనుచున్నది! ఆసి! ఆఁగుమోయి అక్కడ!

క. గండారెడు మద్భుజమున
నిండారం దాల్చినట్టి నిస్త్రింశమునన్
ఖండించి రక్తధారా
క్తుం డగునిను యమపురమునకుం బంపింతున్.

(నిష్క్రమించిరి)

ఇది పంచమాంకము

# ప్రతిమానాటకము

## షష్ఠాంకము

---

(పిదప వృద్ధతాపసులు ప్రవేశింతురు.)

ఇద్దఱు—రక్షింపుఁడయ్యా! రక్షింపుఁడయ్యా!

ప్రథముఁడు—

ఉ. నల్లవొ! కల్వచాల్వలెనె
నల్లనివాఁ డెలతమ్మితూండ్లఁ బోల్
తెల్లనికోఱలన్ నగవు
తెట్టలు వాఱెడువాఁడు! వాఁ డదే!
యల్లదె! రాత్రులన్ దిరుగు
లాడెడు రక్కసిఱేఁడు లేటిలేఁ
బిల్లనుబోలెఁ దాఁ బరిభ
వించి హరించెడు సీతఁ గావరే!

ద్వితీయుఁడు—ఈమొగదరే! మాతల్లి సీతా
దేవి!

ఉ. చేపడి వైవృదప్పి కసిఁ
జెంది బుసల్గొను చిల్వచెల్వనాఁ
బ్రా పెడఁబాపి యూఁప నద
రం జెదరం బడు పూవుఁదీవ నాఁ
దాపసవాటినుండి ఋషి
వర్యతపఃఫలసిద్ధివోసి దీ
పాపి దశాస్యుచేత బల
వంతముగా హరియింపఁగాఁబడెన్.

ఇద్దఱును—కాపాడుఁడయ్యా! కాపాడుఁడయ్యా!

ప్రథ—(ఊర్ధ్వమవలోకించి) ఆహా! పలుకు వెంటనే దశరథునియప్పు దీర్చుకొనుటకుఁగా జటాయువు "నే నుండఁగా నెక్కడికిరా పోయెదవు?" అనుచు రావణుని గద్దించి యంతరిక్షమునకు దుమకినాఁడు.

ద్వితీ—వీఁడుగో! రావణుఁడు దోషముచే గ్రుడ్లు గిఱ్ఱనఁ దిరుగఁగా వెనుకకు మళ్ళినాఁడు.

ప్రథ—వీఁడుగో రావణుఁడు!

ద్వితీ—వీఁడుగో! జటాయువు.

ఇర్వురును—అన్నా! ఇదిగో! అంతరిక్షమున నాఁగినది యుద్ధము!

ప్రథ—కాశ్యప! కాశ్యప! చూడు, చూడు పక్షిరాజుసామర్థ్యము!

స్రగ్ధర—

జక్కాల్ జెక్కించి ప్రత్యర్థిని నెదురెదురై
రేఁగి యాఁగించి పోరన్
ముక్కందొప్పన్ దదంగంబులు చెనకుచుఁ బెన్
ముట్టడిన్ జుట్టి వచ్చున్
ద్రక్కాల్ గా నుక్కుముళ్లై వఱలునఖములన్
వ్రచ్చు వక్షంబు; దానన్
జెక్కాల్ వజ్రాలిన్ వ్రస్సినఁ బడుధరవుం
జెట్టుపల్ పో లె రాలన్.

ద్వితీయుఁడు—అయ్యో! సంక్రుద్ధుఁడై రావణుఁడు ఖడ్గముచేఁ బక్షీశ్వరుని దక్షిణాంసదేశమును నఱకెను!

ఇర్వురును—అయ్యయ్యో! మహానీయుఁడు జటాయువు పడిపోయెనుగదా !

ప్రథ—అయ్యో! కష్టము! ఈ మహానీయుఁడు జటాయువు !

ఉ. ఆటను వచ్చి నెమ్మివలె
నారసె వైరిని, శక్తి మీఱి పో
రాటము సల్పెఁ నెంతను భ
రం బగు నంతను, దీప్ర మైన నై
శాటుని తేజముక్ గసిమ
సంగె, గజేంద్రము పెళ్ళగింపఁగా
నాటవికద్రుమంబు పడు
నట్లు ధరాస్థలిఁ గూలె నయ్యయో !

ఇర్వురును—ఈమహానీయునకు స్వర్గమబ్బును గాక!

ప్రథముఁడు—కాశ్యప ! పోవుదము రమ్ము! ఈ వృత్తాంతమును రాములవారికి విన్నవింతము.

ద్వితీయుఁడు—సరి ! ముఖ్య మది !

[నిష్క్రమించిరి.]

ఇది విష్కంభము.

( అంతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును. )

కాంచుకీ—ఎవరోయి యిక్కడ, కాంచన తోరణ ద్వారమును గాపాడువారు ?

ప్రతీహారి—(ప్రవేశించి) అయ్యా ! నేను విజయను. ఏమి చేయాలి ?

కాంచుకీయుఁడు—విజయా ! విన్నవించు విన్నవించు, భరతకుమారునికి; "రామదర్శనార్థము జనస్థానమునకు వెడలిన సుమంత్రులవారు వీరుగో తిరిగివచ్చినా" రని.

ప్రతీ—అయ్యా ! సుమంత్రులవారు వెళ్ళిన పని చేసుకునే వచ్చినారా ?

కాంచుకీ—అమ్మా ! నే నెఱుఁగను.

గీ. హృదయగతమైన శోకాగ్ని యెగయఁదట్టె
నేమొకో ! వారిమోమెంతయేని వాడె !
వచ్చినారు సుమంత్రులవారు; కాని
వారిఁ గనఁగానె నామది వ్యాకులపడె.

ప్రతీ—అయ్యా ! ఇది వినేటప్పటికి నా హృదయము కొట్టుకొంటున్నది !

కాంచుకీ—అమ్మా! ఇప్పు డిక్కడ నెందు కాఁగెదవు? పోయి శీఘ్రముగా విన్నవింపుము.

ప్రతీ—అయ్యా! ఇదుగో వెళ్ళి విన్నవించు కొంటాను. (నిష్క్రమించును)

కాంచుకీ—(చూచి) ఓహో! ఇదిగో భరత కుమారులవారు, సుమంత్రులవారు వచ్చి రన్న కుతూహలముచే హృదయ ముప్పొంగఁగా వల్క లోత్తరీయమునుగూడ వైచికొనకయే, చిత్రజటా పుంజపింజరితశిరస్కులై యిట్లే వచ్చుచున్నారు!

చ. సకల జగజ్జనప్రణుత
 సద్గుణవర్గుఁడు సూర్యవంశదీ
పకుఁ డమరేంద్రసన్నిభుఁడు
 వైరికులాంతకుఁ డన్నయాన ద
ప్పక సకలావనీవలయ
 పాలనపుంబని పూనుకొన్న వాఁ
డకలుషుఁ డేన్గుగున్నవలె
 నల్లదె మా భరతుండు వచ్చెడున్.

(అంత భరతుఁడు, ప్రతీహారియుఁ బ్రవేశింతురు)

భరతుఁడు—విజయా! అట్టులా? సుమంత్రులవారు విచ్చేసిరా?

గీ. ఆర్యదర్శనమునకు నే నరిగి తొలుతఁ
బడసి వచ్చితి శపథముఁ బాదుకలను
జనమనోబుద్ధినయనరంజనుని రాము
మరలఁ గని వచ్చినారె సుమంత్రు లిపుడు?

కాంచుకీ—(చేరఁబోయి) బాబుగారికి జయము.

భరతుఁడు—సుమంత్రులవా రిప్పు డెక్కడ నున్నారు?

కాంచుకీ—వీరుగో కాంచనతోరణద్వారమున.

భర—అట్లేని శీఘ్రముగాఁ దోడ్కొని రావలెను.

కాంచుకీ—బాబుగారి సెలవుప్రకారము.

(నిష్క్రమించిరి)

(అంత సుమంత్రుఁడు, ప్రతీహారియుఁ బ్రవేశింతురు.)

సుమం—(సశోకముగా) కష్ట మయ్యో! కష్టము!

ఉ. ఉంటినె నేనె నృపాలసత్తముని మృ
  త్యుప్రాప్తినాఁ డగ్గమై
 కంటినె నేనె నృపాలబాలకుల దుః
  ఖప్రాప్తియుం బిమ్మటన్
 వింటినె నేఁటికి నేనె రాఘవుసతో
  వేర్పాటు భూపుత్రి కి
 ట్లుంటన్ నన్ గుణమట్లు దోఁచియుఁ జిరా
  యుష్యంబు బాధించెడున్.

ప్రతీహారి—(సుమంత్రు నుద్దేశించి) విజయం చెయ్యండి! అయ్యా! ఇదుగో యేలినవారు! సమ్ముఖానికి దయచేయండి!

సుమం—(చేరఁబోయి) బాబూ! జయము!

భరతుఁడు—నాయన! చూచితిరా మీరు లోకావిష్కృతమగు పితృస్నేహమును? చూచితిరా ద్విధాభూత మగు నరుంధతీ చరిత్రమును? చూచితిరా సహాకారణావహితవనవాస మగు సౌభ్రాత్రమును?

(సుమంత్రుఁడు చింతిలుచు నూరకుండును.)

ప్రతీహారి—బాబుగారు! గద్దా! అయ్యగారికిని ఏడుగుతున్నది?

సుమం—అమ్మా! ఏమి? నన్నా?

భర—(స్వగతము) ఆయాసము అధికముగా నున్నది! సంతాపముచే భ్రష్టహృదయులుగా నున్నారు! (ప్రకాశము) నడితోవనుండి తిరిగి వచ్చితిరా మీరు?

సుమం—నాయన! నీ యానతిచొప్పున రామదర్శనార్థము జనస్థానమునకు వెడలినవాఁడను నడితోవనుండి యెట్లు తిరిగివత్తును?

భర—వారు కోపముచేఁ గాని, లజ్జచేఁగాని మీకు సమ్ముఖము మీయలేదా యేమి?

సుమం—నాయనా!

గీ. కోప మేల వినీతులకును గలుగును?
లజ్జ యేల స్థిరస్వాంతులకుఁ గలుగును?
వార లచ్చట నాయనా! లేరు; నేను
శూన్యమగు తపోవనమునే చూచినాఁడ?

భర—అయితే వా రెక్కడికి వెళ్ళినట్లు విన వచ్చెను ?

సుమం—కిష్కింధ యను వానరనివాస దేశము గలదు గదా ! అక్కడికి వెడలి రని విన వచ్చెను.

భర—అన్నా, వానరులు మానవుల తార తమ్యమర్యాదల నెఱుఁగనివారుగదా ! ఇక్కట్లు పడుచు నక్కడ నివసించుచుందురు.

సుమం—నాయనా ! తిర్యగ్జాతు లయినను వానరు లుపకారము నెఱిఁగి వర్తింతురు.

భర—నాయనా ! అది యెట్లు ?

సుమంత్రుఁడు—

అన్నయగు వాలి రాజ్యమ్మునందునుండి
బడలుపఱిచి సుగ్రీవుని వెడలనడిచె
నాలిఁ గోల్పోయి పర్వతమందు నుండి
కావఁబడెఁ దుల్యదుఃఖుఁడు గాన యతఁడు.

భర—నాయనా ! తుల్యదుఃఖుఁ డంటివే ! అది యెట్టిది ?

సుమం——(ఆత్మగతము) అయ్యో! అంతయును జెప్పివేసితినే నేను! (ప్రకాశము)నాయనా! ఏమియులేదు. ఐశ్వర్యభ్రంశముచేత నగు సమానతను నేను జేరొంటెసి.

భర——నాయనా! దాఁచుచుంటిరా? సరసులయిన మహారాజుగారి యడుగులతోడని యొట్టువెట్టుచున్నాను. మీరు సత్యమును మఱుఁగు పఱుపరాదు.

సుమం——ఏమిగతి! వినుము.

ఆ. మునిజనావనమున బెనువైర మొదవెను
రామచంద్రునకును రావణునకు
మాయఁ బూని దాన మాయమ్మ సీతమ్మ
నయ్యయో! హరించె నయ్య! వాఁడు.

భర——ఏమీ! హరించెనా?

(మోహముం బొందును)

సుమ——ఊఱడిల్లుము; ఊఱడిల్లుము.

భర——(ఊఱడిల్లి) అయ్యో! కష్టము!

ఉ. చేరుసలేరు బాంధవులు,
  చెందె దివంబును గన్నతండ్రి, కాం
తారములందుఁ బెక్కులు వె
  తల్ పడుచుణ్ వసియించు టాయె, నీ
తీరగు సంకటంబున స
  తీవిరహంబును గల్గె, నార్యుఁ డ
య్యో! రహిఁ బాసె మబ్బముఖుఁ
  గొందిన చందురుమాడ్కి నత్తఱిన్.

అయ్యో! యిప్పు డేమి చేయుదును? కాని! తెలిసికొన్నాను. నాయనా! మీరు నన్ను వెన్నాడుఁడు.

సుమం—బాబు సెలవు ప్రకారము.

(ఇర్వురును బరిక్రమింతురు)

సుమం—నాయనా! పోవలదు; పోవలదు. ఇది దేవేముల చతుశ్శాల.

భర—ఇక్కడనే నాకుఁ బని కలదు. ఓ! ఎవ రిక్కడ? ప్రతీహారీ!

ప్రతీహారి—(ప్రవేశించి) జయము బాబులు గారికి! నేను విజయను.

భర—విజయా! నా రాకను అమ్మగారికి తెలుపుము.

ప్రతీ—ఏ అమ్మగారికి తెలిపేది?

భర—నేను రాజు గావలె నని కోరుకొను నమ్మగారికి.

ప్రతీ—(ఆత్మగతము) అయ్యో! ఏమిటో కదా! (ప్రకాశము) దొరా! చిత్తము!

(నిష్క్రమించును.)

(అంతఁ గైకేయియు, ప్రతీహారియు వత్తురు.)

కైకే—విజయా! నన్ను చూడడానికి భరతుడు వచ్చినాడా?

ప్రతీ—అమ్మా! అవును. రామబాబులుగారి దగ్గరనుంచి సుమంత్రులవారు వచ్చినారు. వారితో కూడా భరతబాబులు అమ్మగారిని దర్శించడానికి వచ్చి తమతో మనవిచేయు మన్నారు.

కైకే—(స్వగతము) అది ఏదో తుట్ట వెళ్ళబెట్టి, నన్ను నిందించడానికి వచ్చినాడు భరతుఁడు.

ప్రతీ—అమ్మా! బాబులు రావచ్చునా?

కై కే—పో! తోడుకొనిరా!

ప్రతీ—అమ్మా! అట్లాగే. (పరిక్రమించి చూచి) జయము బాబులుగారికి! దయచెయ్యండి బాబులు!

భర—విజయా! ఏమి తెలిపితివా?

ప్రతీ—ఆహా! తెలిపినాను.

భర—అట్లయితే లోనికిఁ బోవుదము.

(ప్రవేశింతురు.)

కై కే—బిడ్డా! విజయ చెప్పినది రాముని దగ్గరనుంచి సుమంత్రులు వచ్చినారని.

భర—అంతకంటె హెచ్చుముచ్చటను నివేదించుకొనుచున్నాను మా యమ్మగారికి.

కై కేయి—బిడ్డా! ఏమి కౌసల్యను, సుమిత్రనుకూడా పిలుతునా?

భర—వారు వినవలసినదిగాదమ్మా అది!

కై కేయి—(ఆత్మగతము) అమ్మా! ఏమిటో గదా అది! (ప్రకాశము) చెప్పు నాయనా!

భరతుఁడు—వినుము.

ఆ. అమ్మ! నీయనుజ్ఞ నాత్మరాజ్యంబు వ
ర్జించి యడవులందుఁ జేరె నెవ్వఁ;
డతనిభార్య సీత యపహృత యయ్యె; నిం
డారె నమ్మ, నీ మనోరథంబు!

కైకేయి—అమ్మో!

భరతుఁడు—

సీ. అమ్మరొయో! యున్నత మనస్సమంచితులకు,
సత్త్వమహితుల, కిక్ష్వాకుసంభవులకు
డాపరించితి నీవు గోడలవు తల్లి,
కలిగెఁ గాంతాపహరణ సంకటముగూడ!

కైకేయి—(ఆత్మగతము) కానీ! ఇదీ సమయము చెప్పడానికి! (ప్రకాశము) నాయనా! నీవు ఎరుగవా మహారాజులుంగారిశాపమును?

భర—ఏమీ! మహారాజుగారికి శాపము గలదా!

కైకేయి—(సుమంత్రునితో) అయ్యా! సవిస్తరముగా చెప్పండి!

సుమం—తమ సెలవుప్రకారము. నాయనా! వినుము. పూర్వము మహారాజుగారు వేటకు వెడలియుండఁగా నొకసరస్సునందుఁ గలశమును ముంచుధ్వని వనగజబృంహితమువలె వినవచ్చెను. అది వనగజబృంహితమేయనుకొని శబ్దవేధిశరముచే మహారాజులుగారు కొట్టిరి. కన్నులులేని యొక మహర్షిని గన్నుగాఁ గాపాడుచున్న కన్నకొడుకొకఁడు దానిచేఁ జంపఁబడెను.

భర—చంపఁబడెనా? పాపము! అయ్యో! పాపము! ఆపై! ఆపై!

సుమం—అంత నట్లు చనిపోయిన కొడుకును జూచి,

ఆ. సత్యభాషి యైన సంయమి యాతఁడ
ప్డేడ్చి యేడ్చి తుదకు నిట్టు లనియె
ఓయి! నాకుఁబోలెనను బుడుగునుగాక
నీకుఁగూడఁ బుత్త్రశోకమునను. అని.

భర—అయ్యో! యిది యాపత్తుగదా!

కైకేయి! నాయనా! ఇట్టిస్థితి తటస్థించెటందుకా మహర్షిశాపము, నాపై అపరాధము

మోపి చిరంజీవి శ్రీరాముణ్ణి అరణ్యావాసమునకు అంపినది. అంతేకాని నేను రాజ్యలోభముచేత చేసిన పనిగాదు. తప్పించుకోరాని దా మహర్షి శాపము.— పుత్రవిప్రవాసము సంభవించకపోతే నెరవేరదు.

భర.—అయితే పుత్త్రవిప్రవాస మంటివి; ఎవ రయినను సమానమేకదా! అరణ్యమునకు నన్నే యేల పంపకపోయితివి?

కైకేయి.— నాయనా! మేనమామగారి యింట్లో వున్నావుగావున నీ విప్రవాసము స్వాభావికముగానే ఏర్పడి ఉన్నది.

భర.—అయితే, పదునాలుగేండ్లని యా విప్రవాసమునకు హద్దేల పెట్టవలెను?

కైకేయి.—నాయనా! ఆ బెడదలో నా మనసు చెదరిపోయింది? పదునాలుగునాళ్ళు అన బోయిన నా నోటినుండి పదునాలుగుయేళ్ళు అని మాట జారింది.

భర.__ ఇందు బాగుగా ఆలోచింపవలసిన సంగతి సందర్భము లున్నవి. అయితే ఇది గురు జనమున కెఱుకపడినదా?

సుమం.__నాయనా! వసిష్ఠ వామదేవప్రభృతులు దీని నెఱుఁగుదురు. వారు దీనిసనమ్మతించిరి.

భర.__అన్నా! వారు త్రైలోక్యసాక్షులు గదా! అబ్బా! మాయమ్మ యనపరాధురాలు! అమ్మా! అన్నగారిమీఁది యధికభక్తిచే దుస్సహ క్రోధమున నిన్ను దూషించితిని! నన్ను మన్నింపవలెను. దాని నెల్ల మఱచిపోవలెను. అమ్మా! అభివాదనము చేయుచున్నాఁడను.

కైకేయి.__కన్నతల్లి యెవతె నాయనా బిడ్డ తప్పును మన్నించకుండా ఉండేది? లే, లెమ్ము! ఇందులో తప్పేమి ఉంది?

భర.__ అనుగృహీతుఁడను. అమ్మా! సెల వడుగుకొనుచున్నాఁడను. ఇప్పుడే నేను ఆర్యునకు సాహాయ్య మరుగుటకై రాజమండలమునెల్ల సన్నాహ పఱిచెదను. ఇదిగో! ఇప్పుడే నేను!

గీ. సింధుతీరంబు మదసింధురాంధకారి
తంబు, సైన్యౌఘ శిబిరసద్ధం బొనర్తు
సాగరము రావణునితోడ సమముగాఁగ
గ్లానిఁ బొందింతు సైన్య లంఘనముచేత.

ప్రతీ—(ప్రవేశించి) జయము బాబుగారికి! ఈ వృత్తాంతము విని పెద్దదొరసానిగారు మూర్ఛ పోయినారు.

కైకేయి—అయ్యో!

భర—ఏమీ! మూర్ఛపోయినారా?

కైకేయి—రా, నాయనా! అమ్మను ఓదార్చుదాము.

భర—అమ్మగారి సెలవుప్రకారము.

(అందఱు నిష్క్రమించిరి)

ఇది షష్ఠాంకము

---

# ప్రతిమా నాటకము

---

## సప్తమాంకము

[అంతట దాపసుడు ప్రవేశించును]

తాపసుడు—నందిలక! నందిలక!

నందిలకుడు— (ప్రవేశించి) అయ్యా! ఇదిగో ఉన్నాను.

తాప—నందిలక! కులపతులవా రాజ్ఞాపించుచున్నారు. "స్వదారాపహర్తయు, త్రైలోక్యవిద్రావణుడును నగు రావణుని నాశపఱిచి, రాక్షసగణ విరుద్ధవర్తనుడును, గుణగణవిభూషణుడును నగు విభీషణుని నభిషిక్తునిం జేసి దేవదేవర్షి సిద్ధవిమల చారిత్ర యగు సీతాదేవిని దోడ్కొని ఋక్షరాక్షసవానరముఖ్యులతోఁ బరివృతుఁడై శరద్విమల చంద్రునివలె నభిరాముఁడై శ్రీరామచంద్రుఁడిక్కడికి కిచె యరుదెంచినాఁడు. కావున నిప్పుడీయాశ్రమపదమున మన విభవమునకుఁ దగి

నంతమట్టున నేవేవి సత్కారసన్నాహాములు గావింపవలెనో యవియెల్లఁ గావింపవలసినది'' అని.

నంది—అయ్యా! అంతా సిద్ధమయింది. కాని—

తాప—ఏ మది?

నంది—ఇక్కడ విభీషణ సంబంధులు రాక్షసులుకూడా ఉన్నారుగదా! వారి భక్షణాలను గురించి కులగురువులవారి సెల వేమో తెలుసుకోవలెను.

తాప—అది యెందుకు?

నంది—వారికి కలుకుట్లు మొదలయినవి కావలె గాదండీ!

తాప—ఆఁగు. ఆఁగు. దానికై నీ వాత్రపడ నక్కఱలేదు. రాక్షసు లిప్పుడు విభీషణవిధేయులు గదా!

నం—రాక్షససజ్జనానికి దణ్ణాలు!

(నిష్క్రమింతురు)

తాపసుఁడు—(చూచి) అదే! రామచంద్రుల వారు! ఆహా!

మ. జయమో భూవర! నీకు నింక నెవఁడున్
  శత్రుండు లేకుండుతన్
గయి సేయంబడుగాక నీ కరుణ నే
  కచ్ఛత్రమై యుర్వి, యం
చయ మగ్గించుచు మాను లుత్సుకతఁ గొం
  డాడన్ విమానంబు పై
మయి డిగ్గంగ ధరాతలంబునకు రా
  మస్వామి విచ్చేసెడున్.
జయము! దేవా! జయము! (నిష్క్రమించును)

ఇది మిశ్రవిష్కంభము

(అంత రాముఁడు ప్రవేశించును.)

రాముఁడు—ఓహో!

చ. జ్వలితబలప్రతాపుఁ డగు
  వైశ్రవణున్ బరిమార్చి సద్గుణో
జ్జ్వలను విశుద్ధవర్తనను
  జానకిఁ దోడ్కొని తప్పకుండఁగాఁ

జలుపంగం బూనినట్టి గురు
శాసనముఁ గడముట్టం జల్పి, నేఁ
గలయంగం జొచ్చితిఁ మరలం
గాననమౌనినివాసదేశముల్.

తాపసాంగనల నభివాదించుటకు లోపలి కరిగి వైదేహి జాగుచేయున్నదికదా! (చూచి) ఇదిగో వైదేహి!

క. చెలి! కోడల! బిడ్డా! మై [త్రునఁ
థిలి! యని వయసునకుఁ దగిన తెఱంగు చన
బిలుచుచుం దోడై మానుల
మెలుతలు రావచ్చుచుండె మెలమెల్లనగాఁ.

(పిదప సీతయుఁ దాపసియుఁ బ్రవేశింతురు.)

తాపసి—చెలీ! ఇదుగో నీ యజమానులు. వారిని చేరబో; నిన్ను ఒక్కతైనుగా జూడజాలను.

సీత—ఔను. ఇప్పటికీ నాకు నమ్మిక కలుగనట్టే ఉన్నది. (జేరంబోయి) ఆర్యపుత్త్రులకు జయము.

రాముఁడు—మైథిలీ! గుర్తింపఁగలవా? మనము పూర్వమున్న జనస్థానముసుమా ఇది! నీకుఁ దలఁపునకు వచ్చుచున్నవా, ఇక్కడ బిడ్డలం బోలెఁ బెంచిన వృక్షము లివి?

సీత—తెలుసుకున్నాను. తెలుసుకున్నాను. ఆకులను అందుకొని క్రిందికి చూడదగివుండే గున్న మొక్కలిప్పుడు ఆకు లందక తల పై కెత్తి చూడవలసిన వయినవి.

రాముఁడు—అవును. మిట్టను బల్లముగాను, బల్లమును మిట్టనుగాను జేయుచుండునుగదా కాలము! మైథిలీ! స్మరింతువా? ఈసప్తపర్ణతరువుక్రిందఁ దెల్లవల్వాలఁ దాల్చినభరతునిఁ జూచి లేళ్ళగుంపు భయపడి పాఱిపోయెను!

సీత—ఆర్యపుత్త్ర! బాగా జ్ఞాపకమున్నది.

రాముఁడు—ఇదిగో! మనతపస్సునకు సాక్షియయిన పెద్దచెఱువు. ఇక్కడ మనము గూర్చుండి

నాయనగారికి శ్రాద్ధతర్పణవిధి విషయమును జింతించుచుండగాఁ గాంచనపార్శ్వ మనుమృగము గాన వచ్చెను.

సీత__ఆర్యపుత్త్రా! వద్దు వద్దు. ఈ విషయ మెత్తవద్దు. (భీతిచే వణఁకును.)

రాముఁడు__వలదు. గజిబిజి పడవలదు. ఆ కాలము గడచిపోయినది. (దిక్కులను జూచి) అరె! ఏమి టిది?

ఉ. గాలికి రేఁగి లోధ్రసమ
గౌరముగా దెస లెల్లఁ గ్రమ్మెఁ గెం
ధూళులు; శంఖనాదముల
దొందడిఁ దప్పెటమ్రోఁతసందడిన్
వాలుభటాళి సింహవిర
వంబులడంబునఁ గాననంబు గ
గ్గోలయి రాజధాని యను
కోఁదగినట్లు రహించె నేలొకో?

లక్ష్మ__(ప్రవేశించి) జయము! ఆర్యునకు. అన్నా!

ఆ. భ్రాతృవత్సలుండు భరతుండు వాఁడుగో!
అన్న! నిన్నుఁ జూడ నాసపడుచు
నరుగుదెంచె ముగ్గురమ్మలతోడను
బహుళమైన సైన్యభరముతోడ!

రాముఁడు—వత్స! లక్ష్మణ! అట్టులా! భరతుఁడు వచ్చెనా?

లక్ష్మ—అన్నా! ఔను.

రాము— మైథిలీ! అత్తగారలతో వచ్చిన భరతునిఁ జూచుటకు నీ చూడ్కులను విశాల పఱచుకొనుము.

సీత— ఆర్యపుత్రా! వాంఛించఁదగిన వేళకు భరతుఁడు వచ్చినాడు.

**(అంత భరతుఁడు తల్లులతో వచ్చును)**

భరతుఁడు—

ఉ. హెచ్చిన మబ్బులెల్ల నశి
యింప శరచ్ఛశి వెల్లునట్లు పై

వచ్చిన కుచ్చితంపు దుర
వస్థల వెల్ల దొలంగిపోవఁగా
నచ్చపుఁ గీర్తితో వెలయు
నార్యు సతీసహితుŋ గనుంగొనŋ
వచ్చితి నే నిదే స్వజన
వర్గముతోఁ బరమోత్సవంబునŋ.

రాముఁడు—అమ్మలారా! అభివాదనము చేయుచున్నాఁడను.

అందఱు — దీర్ఘాయుష్మంతుడవు గమ్మ నాయనా! ప్రతిజ్ఞ నెరవేర్చుకొని క్షేమముగా మా కోడలితో నీవు రావడము చూచినాము! మా భాగ్యము పండినది నాయనా!

రాము—అనుగృహీతుఁడను.

లక్ష్మ—అమ్మలారా! అభివాదనము చేయుచున్నాఁడను.

అందఱు — దీర్ఘాయుష్మంతుడవు గమ్మ నాయనా!

లక్ష్మ—అనుగృహీతుఁడను.

సీత—అమ్మలారా! మొక్కుచున్నాను.

అందఱు—దీర్ఘసుమంగళివి గమ్మా మా తల్లీ!

సీత—అనుగ్రహము.

భర—ఆర్యా! అభివాదనము చేయుచున్నాఁడను. నేను భరతుఁడను.

రాము—రా రమ్మా! వత్స! ఇక్ష్వాకుకుమార! స్వస్తి. ఆయుష్మంతుఁడ వగుము.

ఉ. దగ్గఱ కేఁగుదేరుమ! వె
  డందకవాటము తీరు పేరురం
బొగ్గుమ! నీ సుదీర్ఘభుజ
  యుగ్మమునన్ నను నిండుఁగౌఁగిటన్
బిగ్గ గ్రహింపుమా! వెలయు
  నెమ్మొగ మెత్తుమ! శోకవహ్నిచే
బొగ్గులు వాఱియున్న తను
  వున్ దనియింపుమ రమ్మ! తమ్ముఁడా.

భర— అనుగృహీతుఁడను. అమ్మా! అభివాదనము చేయుచున్నాఁడను. నేను భరతుఁడను.

సీత—ఆర్యపుత్త్రిలతో కలసిమెలసి చిరకాలము వర్ధిల్లుము.

భర—అనుగృహీతుఁడను. అన్నా! అభివాదనము చేయుచున్నాఁడను.

లక్ష్మ—రా రమ్మ! తమ్ముఁడా! దీర్ఘాయుష్మంతుఁడ వగుము. నన్నుఁ గౌఁగిలించుకొనుము.

(కౌఁగిలించుకొనును)

భర—అనుగృహీతుఁడను. ఆర్యా! రాజ్యభారమును గై కొనుము.

రాము—వత్స! అది యెట్లు?

కై కే—నాయనా! ఈ కోరిక చిరకాలము నుంచి కోరుకొంటూ ఉన్న దేగదా!

(అంత శత్రుఘ్నుఁడు ప్రవేశించును)

శత్రుఘ్నుఁడు—

గీ. పలు తెలుంగుల వెతలు తఱ గలఁచెఁగాక
గుణములందుఁ దేజమునందుఁ గుంటువడఁడు

ఔర! మాయన్న! యారావణాంతకుని౯
గాంచుటకు నామనసు తొందరించుచుండె.

(చేరఁబోయి) ఆర్యా! శత్రుఘ్నుఁడను నే నభి
వాదనము చేయుచున్నాఁడను.

రాము—రా రమ్మా! తమ్ముఁడా! స్వస్తి!
ఆయుష్మంతుఁడ వగుము.

శత్రు— అనుగృహీతుఁడను. ఆర్యా! అభి
వాదనము చేయుచున్నాఁడను.

లక్ష్మ—స్వస్తి. ఆయుష్మంతుఁడ వగుము.

శత్రు—అనుగృహీతుఁడను. ఆర్యా! వీరుగో
వసిష్ఠవామదేవులు ప్రకృతులతోఁగూడ నభిషేక
మును బురస్కరించుకొని మీ దర్శనముఁ గోరు
చున్నారు.

శా. ఆరంగల్గు నదీనదౌఘముల తీ
  ర్థాంబుల్ తపస్సంపద౯
జేర౯ దా రయి తోడితెచ్చిరి మహ
  ర్షి శ్రేష్ఠు! లాసింతుర

ద్వారల్ దేవ! నవాభిషేకసలిల
ప్రచ్యోతసంసిక్తమై
నీరన్ దోఁచిన తమ్మిపూ దొరయు నీ
నెమ్మోము వీక్షింపఁగన్.

కైకే—నాయనా! పద! అభిషేక మంగీకరించు.

రాము—అమ్మా! సెలవు ప్రకారము.

(నిష్క్రమించును)

(నేపథ్యమున)

జయ! దేవా! జయ! ప్రభూ! జయ! మహారాజా! జయ ! భద్రముఖా! జయ! ఆర్యా! జయ! రావణాంతకా!

కైకే—ఇదిగో! పురోహితులు, కంచుకులు మానాయనను విజయఘోషము వెలయిస్తూ, ఆశీర్వచిస్తూ, పూజిస్తున్నారు.

సుమి—ప్రకృతులు, పరిచారకులు, సజ్జనులు మానాయనకు విజయమును వెలయ జేస్తున్నారు.

(నేఁ థ్యమున)

ఓహో ! జనస్థానవాసులారా ! తపస్వు లారా! వినుండు! మీరు వినుండు!

ఉ. శౌర్యమయూఖసంచయము
 సంజ్వలితం బొనరించి లోకదు
 ర్వార్యము గాఁగఁ గ్రమ్ముకొను
 వైరిసమూహమహాంధకారముఁ
 సూర్యునిబోలెఁ బోకడచి
 శుద్ధచరిత్రను సీతఁ గూడ ధీ
 వర్యుఁడు రాముఁ డొప్పె విభ
 వంబున నుర్వి జనాభిరాముఁ డై.

కైకేయి—ఆహా! మా నాయనకు విజయ ఘోషణ వర్ధిల్లుచున్నది.

(అంత కృతాభిషేకుఁడై రాముఁడు సపరివారముగా ప్రవేశించును)

రాముఁడు— (ఆకాశమునకై చూచి) ఓ నాయనా!

చ. దివముననుండియేసు పరి
తృప్తిని జెందుమ! కుందు వీడుమా!
భవదనుచింతితం బయిన
ప్రాభవ మిష్టు లభించె నాకు, నే
నవనివిభుండ నైతి; నిఁక
నాదట సత్కృతభారవాహి నై
ప్రవిమలధర్మపద్ధతిని
బాలనసేయుదు నెల్లలోకమున్.

భరతుఁడు—

మ. సమకూరెన్ నృపసంజ్ఞ, మౌక్తికమయ
చ్ఛత్రంబు వెల్గొందె, మూ
ర్ధముపై దివ్యమణీకిరీట మొదవెన్,
రంజిల్లెఁ దీర్థాభిషే
కము, లోకుల్ ప్రణమిల్లుచుండిరి, కళా
కాంతుల్ విజృంభించె, వే
డ్కమజెంతయ్యెడు నూత్న చంద్రునటు చూ
డంజూడ నా కార్యునిన్.

శత్రుఘ్నుఁడు—

క. చందురుఁ బొడఁబుస సిల దెలి
నందినచందమున నార్యునభిషేకమునకా
గం బెల్లఁ బాసి మున్దటి
యందమ్మున నస్మదన్వయము శోభిల్లెన్.

రాముఁడు—వత్స లక్ష్మణా! నేను రాజ్యము నధిగమించితిని.

లక్ష్మణుఁడు— ఆర్యా! మా యదృష్టమున మీ రిప్పటికి అలరారుచున్నారు.

కాంచుకీ—(ప్రవేశించి) జయము! మహారాజులుంగారికి! వీరుగో విభీషణులవారు విన్నవించుకొనుచున్నారు. సుగ్రీవ నీల మైంద జాంబవ ద్ధనూమత్ప్రముఖుఁబుగూడ వెంట వచ్చుచు విన్నవించుకొనుచున్నారు. 'మా యదృష్టమున మీ రిప్పటికి అలరారుచున్నారు' అని.

రాము—"సహాయుల యనుగ్రహమున నలరారుచుండె" నని వారికిఁ దెలుపుము.

కాంచుకీ — మహారాజులుంగారి సెలవు ప్రకారము.

కైకే— ధన్యురాల నయితినిగదా! ఈ యభ్యుదయమును అయోధ్యలోఁగూడా చూడ గోరుతున్నాను.

రాము—అమ్మా! చూడఁగలవు. (చూచి) అహో! ప్రభలచే నీవన మెల్ల భాస్కరుఁ డున్నది వలె వెలుంగుచున్నది. (ఊహించి) ఆహా! తెలిసినది. మింటిపయికి రావణవిమానమగు పుష్పకము వచ్చినది. స్మరించినంతనే వచ్చున ట్టీ విమానముతో నేర్పాటు గలదు! అయిన నిఁక నందఱు నారోహింతురుగాక!

(అందఱు నారోహింతురు)

రాముఁడు—

గీ. ఇప్పుడే నే నయోధ్యకు నేఁగువాఁడ
బాంధవులు మిత్రులును దోడ బలసిరాఁగ,

లక్ష్మణుఁడు—

కాంత్రుగావుత మిపుడె నాగరులు నిన్నుఁ
దారకాన్వితు నుదయచంద్రమునిఁబోలె.

భరతవాక్యము—

ఆ. సీతతోడ బంధుజాతంబుతోఁ బొంది
పొసఁగి రాముఁ డుర్విఁ బ్రోచినట్లు
ప్రోచుఁగాత మాతృభూమిని లక్ష్మిస
మేతుఁ డగుచు మా మహీశ్వరుండు.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది సప్తమాంకము.

# దిద్దుబాట్లు

తొలిపలుకులో :—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౬ | గార్యాంతమున | గార్యాంతరమున |
| ౩ | ౧౧ | కాండములో | కాండలో |
| ౬ | ౮ | ప్రోత్సహితుడను | ప్రోత్సాహితుడను |

ప్రతిమా నాటకములో :—

| | | | |
|---|---|---|---|
| ౫ | ౧౧ | సపరివారియై | సపరివారయై |
| ౨౭ | ౮ | వియమం | నియమం |
| ౩౧ | ౧౬ | గంధేభయాథంబు | గంధేభయూథంబు |
| ౩౯ | ౮ | గములుం | గములం |
| ౪౧ | ౬ | సమం | మమం |
| ౪౪ | ౧౬ | దొడ్ల | దొడ్డ |
| ౪౯ | ౧౪ | నాఁటిని | నాఁటిన |
| ౫౩ | ౧౧ | గురువచముసు | గురువచనమును |
| ౫౩ | ౧౩ | విశ్రమింతురు | విశ్రమింతును |
| ౬౨ | ౧౮ | రావణులు | రాణులు |
| ౬౭ | ౪ | నయోాఢ్య | నయోఢ్య |
| ౭౭ | ౧౮ | ఊరుముఁ | ఊఱుముఁ |
| ౭౮ | ౧ | సర్వముఁ | స్వారముఁ |
| ౮౫ | ౬ | డిగ్గ | బిగ్గ |
| ౮౬ | ౧౫ | చిరజీవత్వము | చిరజీవిత్వము |

| | | | |
|---|---|---|---|
| ౭౮ | ౯ | ఆర్యపుత్త | ఆర్యపుత్త్రి |
| ౯౮ | ౧౬ | బురుదు | బురుద |
| ౧౦౦ | ౯ | యత్నింమచుంట | యత్నించుచుంటి |
| ౧౦౯ | ౧౫ | జనము | జపము |
| ౧౧౦ | ౧౨ | సీన___ | సీత___ |
| ౧౧౨ | ౧౫ | ఆర్యపుత్త్రా | ఆర్యపుత్త్రా |
| ౧౧౩ | ౪ | రాఁడఁగ నేఁగ నేఁగు | రాఁడఁగ నేఁగు |
| | | దేరఁగలఁ | దేరఁగలఁ |
| ౧౧౬ | ౧౬ | దుకుకినాఁడు | దుమికినాఁడు |
| ౧౧౬ | ౧౬ | దోషముచే | రోషముచే |
| ౧౧౮ | ౧౪ | వజ్రాతిజ్ఞ | వజ్రాహాతిజ్ఞ |
| ౧౨౫ | ౬ | సరసు | స్వరసు |
| ౧౨౫ | ౧౩ | మాగ్ధమమ్మ | మాగ్ధయమ్మ |
| ౧౨౯ | ౧౦ | కిక్ష్వాకు | కిక్ష్వాకు |
| ౧౩౦ | ౨౯ | కై కేయి! | కైకేయి___ |
| ౧౩౪ | ౮ | తాస___ | తాప___ |
| ౧౩౫ | ౧౮ | నం___ | నంది___ |
| ౧౩౭ | ౧౫ | ఆర్యపుత్త | ఆర్యపుత్త్రి |
| ౧౪౦ | ౧౮ | వెల్లువట్లు | వెల్గువట్లు |
| ౧౪౬ | ౧౦ | గూడ | గూడి |
| ౧౪౭ | ౩ | పాడవున | పాడువున |
| ౧౪౭ | ౮ | వత్స లక్ష్మణ! | వత్స, లక్ష్మణ! |

| | | | |
|---|---|---|---|
| ౮౭ | ౯ | ఆర్యపుత్త | ఆర్యపుత్త్రి |
| ౯౭ | ౧౬ | బురుదు | బురుద |
| ౧౦౦ | ౯ | యత్నింమచుంట | యత్నించుచుంటి |
| ౧౦౬ | ౧౫ | జనము | జపము |
| ౧౧౦ | ౧౨ | సీన___ | సీత___ |
| ౧౧౨ | ౧౫ | ఆర్యపుత్రా | ఆర్యపుత్త్రా |
| ౧౧౩ | ౪ | రాడఁగ నేఁగ నేఁగు దేరఁగలఁ | రాడఁగ నేఁగు దేరఁగలఁ |
| ౧౧౬ | ౧౬ | దుకుకినాఁడు | దుమికినాఁడు |
| ౧౧౬ | ౧౬ | దోషము చే | రోషముచే |
| ౧౧౭ | ౧౪ | వజ్రాతిజ్ఞ | వజ్రాహతిజ్ఞ |
| ౧౨౫ | ౬ | సర్గస్థు | స్వర్గస్థు |
| ౧౨౫ | ౧౩ | మాఘమ్మ | మాయమ్మ |
| ౧౨౯ | ౧౦ | కిష్క్యాకు | కిష్క్వాకు |
| ౧౩౦ | ౧౯ | కై కేయి! | కై కేయి___ |
| ౧౩౪ | ౭ | తాన___ | తాప___ |
| ౧౩౫ | ౧౭ | నం___ | నంది___ |
| ౧౩౮ | ౧౫ | ఆర్యపుత్తే | ఆర్యపుత్త్రి |
| ౧౪౦ | ౧౭ | వెల్లునట్లు | వెల్గునట్లు |
| ౧౪౬ | ౧౦ | గూఢ | గూఢి |
| ౧౪౮ | ౩ | పొడవున | పొడుపున |
| ౧౪౮ | ౭ | వత్స లక్ష్మణ! | వత్స, లక్ష్మణ! |

*For Copies Apply to:*

**V. SANKARA SASTRI,**

PUBLISHER, MANIMANJARI,

**MUKTYALA, Kistna District.**